కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-58 ఫిబ్రవరి2013

**మూలం: http://kottapalli.in/2013/2/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'రంగుల జలపాతం':** బత్తెన హరికృష్ణ

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల: రూ.25/-**

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాటుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in




# విషయ సూచిక

# చదువుకు జోహార్లు!

ఐదేళ్ల చింటూని బెదిరిస్తోంది వాళ్లమ్మ: "రేయ్! అల్లరి మానేసి బుద్ధిగా చదూకో, లేకపోతే టీచరుగారు కొడతారు చూడు!" అని.

చింటూకి కూడా తెలుసు ఆ సంగతి. వాడు రోజూ స్కూల్లో చూస్తూనే ఉన్నాడు.

టీచర్లు పిల్లల్ని బాగా చదవలేదని కొడతారు; యూనిఫాం సరిగ్గా వేసుకురాలేదని కొడతారు; ఆలస్యంగా వచ్చారని కొడతారు; ఎక్కువ నవ్వితే కొడతారు; నవ్వకుండా నిలబడితే సమాధానం చెప్పలేదని కొడతారు. ఒక్కోసారి ఊరికే కూడా కొడతారు.

ఇదంతా చూస్తూ గట్టిపడ్డాడు చింటూ. ఇప్పుడు వాడికి కొట్టించుకోవటం అంటే భయం పోయింది. "టీచర్లు కొడితే, తన్నులు తినేస్తే సరి- ఎక్కువ బాధపడకుండా ఊరుకునేస్తే సరి" అనిపిస్తోంది. "వాళ్లు తనని కొట్టకుండా ఉండలేరు, ఎలాగూ- తను బాగా చదువుకున్నాడనుకో, రైటింగు బాలేదని కొట్టచ్చు; అల్లరి చేయకుండా బుద్ధిగా ఉన్నాడనుకో, చొక్కాయి మురికిగా ఉందని కొట్టచ్చు... ఎలాగూ తన్నులు తినే దానికి, ఇక చదవటం ఎందుకు?"

వాడంటే ఇంకా చిన్నపిల్లాడు. మీకు తెలుసా మరి, ఎందుకు చదవాలో?

చదవాల్సింది టీచరు గారు కొడతారని భయపడికాదు. అమ్మానాన్నలకి భయపడీ కాదు.

కొందరు పెద్దపిల్లలు పేరు కోసం, ర్యాంకుల కోసం చదవాలనుకుంటారు. బాగా అలిసిపోతారలాగ.

కొందరైతే గొప్పగొప్ప ఉద్యోగాల కోసం చదువుతారు. అవి అందరికీ రావుగా, ఎలాగూ? అప్పుడు, అవి రాకపోతే, వీళ్లు బాగా నిరాశపడిపోతారు. ఒకవేళ ఆ ఉద్యోగాలే వచ్చాయనుకో- "నా అంతవాడు లేడు" అని పొగరుమోతుతనం పోతారు.

చాలా సంవత్సరాలక్రితం పోతన గారు ఓ పద్యంలో చెప్పారు చదువెందుకో-

*చదవని వాడజ్ఞుండగు*

*చదివిన సదసద్వివేక చతురత కలుగున్*

*చదువగ వలయును జనులకు*

*చదివించెద నార్యులొద్ద, చదువుము తండ్రీ*- అని.

చదవని వాడికి జ్ఞానం రాదు - వాడికి ఏమీ తెలీదు కదా, అందుకని ఒట్టి అజ్ఞాని అవుతాడన్నమాట.

మరి చదివితే-? మంచేంటో, చెడేంటో, వాటి మధ్య తేడాని గుర్తించటం ఎలాగో - ఇదంతా వచ్చేస్తుంది. అందుకని, చదవాలి.

మంచి గురువుల దగ్గర చదవాలి.

అజ్ఞానం పోగొట్టుకునేందుకు, మనం పుట్టిన యీ ప్రపంచంలో ఏది ఏంటో, ఎందుకు -ఏది- ఎలా జరుగుతోందో తెలుసుకునేందుకు, సరిగ్గా ఎట్లా బ్రతకాలో నేర్చుకునేందుకు చదవాలి.

చలికాలం చదువులకాలం కూడాను! యీ కాలంలో హాయిగా కూర్చొని, ఇష్టంగా చదువుకోవచ్చు, కావాలనుకుంటే.

కావాలనుకుందామా మరి?!

అభినందనలతో,

కొత్తపల్లిబృందం. 




# నీతి చంద్రిక

విగ్రహం(యుద్ధం)-15

*జరిగిన కథ: నెమలి రాజు రాయబారానికై పంపిన అరుణముఖుడు వెనక్కి తిరిగి వచ్చి, హంస ఏమన్నదో వినిపించాడు. యుద్ధం అనివార్యం అని తేలిపోయింది. నెమలి రాజు పంపిన గూఢచారి కాకి అక్కడ హంస కొలువులో చేరుకున్నది.... ఇకచదవండి, నీతి చంద్రిక 39 వ భాగం.*

*మూలం: కీ.శే. కందుకూరి వీరేశలింగం సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ.*

చిత్రవర్ణుడు కొనసాగించాడు- "మీరందరూ తెలివైనవాళ్ళు. మీకు ధర్మాలు ఉపదేశించవలసిన పనిలేదు. బాగా ప్రొద్దు పోయింది. ఇక ఆలస్యం దేనికి? మీ మీ సైన్యాలను సిద్ధం చేసుకొని రండి. పాండి! యుద్ధం చేసి, మనం ఆ శత్రువు సంపదల్ని మొత్తాన్నీ దోచుకొని వద్దాం. బలం ఉన్నవాడివే సంపదలు!" అన్నాడు.

అప్పుడు మంత్రి దూరదర్శి లేచి నిలబడి - "ప్రభూ! ఇంట గెలిచి రచ్చ గెలవాలి' అని చెబుతారు. ముందు మన సంగతి మనం ఆలోచించుకుందాం. అరుణముఖుడు

చెప్పిన ప్రకారం చూస్తే 'యుద్ధం సరైనది' అని అనిపించటంలేదు. మన మిత్రులు, మంత్రులు, సేవకులు నిశ్చయంగా నమ్మ-దగిన వాళ్ళూ, మన మాట జవదాటని వాళ్ళు అయి ఉండి, శత్రుపక్షంలోని వాళ్ళు దానికి వ్యతిరేకంగా ఉన్నట్లయితే, అప్పుడు కదా, యుద్ధం చేయవలసింది?! అంతేకాదు- యుద్ధానికి దిగేముందు 'భూమి , ధనం 'అనే రెండింటినీ ముఖ్యంగా సమకూర్చుకోవాలి. అవి సమకూరిన తర్వాతనే కదా, యుద్ధం మొదలు పెట్టాల్సింది? తొందరపడి'ఏదో ఒకటి కానివ్వు' అని ముందుకు ఉరికేందుకు, ఆ హిరణ్యగర్భుడు అంత చేతకానివాడేమీ కాదు కూడాను.

మనం అనుకుంటున్నట్లు అతడు అంత సులభంగా లొంగేవాడుకాదు. అతను బల-వంతుడేకాదు, ప్రజలవిశ్వాసం చూరగొన్న-వాడు. అతని సైనికులు కూడా చాలా పరాక్రమవంతులు. శత్రువుల బలాన్ని అంచనా వేయకనే సాహసం చేసే వాళ్ళు సింహం బారిన పడే జింకలలాగా మరణిస్తారు. కాబట్టి మనం యీ సాహసాన్నించి వెనక్కి తగ్గితే మేలు" అన్నది.



ఆ మాటలతో ముఖం జేవురించగా చిత్రవర్ణుడు మంత్రి మాటల్ని తేలికగా కొట్టివేస్తూ "నీ మాటలేవో చాలా విచిత్రంగా ఉన్నాయే? చూడగా నువ్వు బాగా ముసలివాడివి ఐపోయినట్లున్నావు. తల నెరిసినంత మాత్రాన జ్ఞానం వచ్చేస్తుందా ఏమిటి? ముసలివాళ్ళు తమకు అనుకూలం-గా ఉన్నవాటినే చూస్తారు తప్పిస్తే, ఇక వేటినీ కానరట! జ్ఞానంతో ముసలివారైతే గద, వాళ్ళ మాటల్ని సభికులు పట్టించుకునేది?

నేను పరరాజ్యాన్ని ఆక్రమించుకునేందుకు

ఎట్లాగూ నిశ్చయించుకొని ఉన్నాను. ఇక మా ఉత్సాహాన్ని నీరుగార్చేటట్లు, నువ్వు నేర్చిన నీతులన్నీ మాముందు వల్లించే సాహసం చెయ్యకు.



నీకు ఓపిక ఉన్నట్లైతే, గెలుపుకు తగినవీ, ఉల్లాసాన్ని కలిగించేవీ ఏమైనా మాట్లాడు. ఆ మాత్రం చేసినా నువ్వు మాకు మహోపకారం చేసినట్లు భావిస్తాం, మేము" అని చాలా కరకుగా మాట్లాడాడు.

దాంతో మనసు ఎంత నొచ్చుకున్నా నొచ్చుకోనట్లు, పై పెచ్చు చాలా సంతోషం కలిగినట్లు, భరింపరాని అవమానం తనకు చేసిన గాయం పిసరంత కూడా బయటికి కనిపించకుండా నవ్వు ముసుగు వేసుకొని, లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని నటిస్తూ, ఆ గ్రద్దమంత్రి "మాకందరికీ ప్రభువులవారంటే ఉన్న ప్రేమాభిమానాలకొద్దీ, కపటం లేకుండా నా మనసులోని మాట చెప్పాను. చెవికి చేదుగా ఉన్నాకూడా, సేవకుడన్నవాడు తన ప్రభువు మేలుని దృష్టిలో ఉంచుకొని తన మనసులోని మాటను చెబుతుండాలి. అట్లా కాకుండా కొందరు మూర్ఖులు యజమాని మనసు ఎక్కడ నొచ్చుకుంటుందో అని, తమకు తెలిసినదాన్ని కూడా దాచిపెట్టి, కక్కుర్తి కొద్దీ నోరు తెరవకుండా ఊరుకుంటారు. అట్లాంటి వారినే 'స్వామి ద్రోహులు' అంటారు. వాళ్ళకి ఈ లోకంలోనూ, పరలోకంలో కూడాను శాంతి ఉండదు. అన్ని ధర్మాలూ ఎరిగినవారు- తమకు తెలియదా, నీతిమంతులెవరో, అవినీతి పరులెవరో? మేమందరం తమ సుఖదు:ఖాలను మావిగా భావించుకొని, తమరి అనుజ్ఞ కొద్దీ మెలిగే సేవకులం. తమరి

ఆజ్ఞ ఏదైనా మేం మీరం. తమరు సత్య సంకల్పులు- తమరు అలా ఆనతి ఇవ్వగానే సేనా సమూహాలన్నీయుద్ధోత్సాహంతో బారులు తీరి ఇలా తరలి వచ్చేశాయి. దండయాత్రకు ఇది మంచి సమయం. 'శత్రువు చిన్నవాడు కదా' అని ఆలక్ష్యం పనికిరాదు. చిన్నపామునైనా పెద్ద కర్రతోనే కొట్టాలి. కాబట్టి సైన్యం మొత్తాన్నీ తీసుకు వెళ్ళి, అకస్మాత్తుగా దాడిచేసి మీద పడ్డామంటే శత్రుసైన్యాలను మట్టి కరిపించటం మనకు తేలిక అవుతుంది. కాలయాపన చేశామంటే వాళ్ళందరూ సన్నద్ధులవ్వటమే కాదు, తమ స్నేహితులను కూడా సాయానికి తెచ్చుకుంటారు. అప్పుడిక వాళ్ళను ఓడించటం కష్టమౌతుంది.

కాబట్టి వెంటనే శత్రు భయంకరంగాను, మిత్రులకు సంతోషం కలిగేటట్లుగాను యుద్ధానికి బయలుదేరదాం. పనిని ఎప్పుడైనా సమయం అయిపోకముందే చేయటం సరైన పని. "ఆలస్యం అమృతం విషం" అని చెబుతారు కదా, పెద్దలు?!" అన్నది.

గ్రద్ద పలికిన ఆ మాటలకు నెమలి రాజు సంతోషించి, సైనికదళాలను ముందుకు నడుపమని తన సేనానులకు ఆజ్ఞనిచ్చి, దాడికి బయలుదేరింది. అటుపైన ఆ సైన్యం ఇక ఎక్కడా ఆగకుండా ప్రయాణించి, త్వరలోనే హంసరాజ్యానికి ఆవలనున్న కొండను చేరుకొని, అక్కడ విడిది ఏర్పాట్లలో మునిగాయి.



ఇక అక్కడ, హంసరాజు హిరణ్యగర్భుడు కొలువై ఉండగా, అంతకు ముందు చిత్రవర్ణుడి దగ్గరికి వెళ్ళి వచ్చిన కొంగ-దీర్ఘముఖుడు వచ్చి నిలబడ్డాడు. పరుగున వచ్చినందువల్ల

ఆయాసంతో క్రొద్ది సేపు నిలబడి అటుపైన ప్రభువుకు నమస్కరించి, ఆయన అనుమతితో దగ్గరికి వెళ్ళి నిల్చున్నాడు. ఏదో చెప్పదలచినవాడు కాస్తా కొంచెం సంకోచించి, అక్కడ నిల్చున్న వారందరినీ చూసేసరికి, అతని మనసెరిగిన మేఘవర్ణుడు, ఇతరులు అవతలికి పోయారు.



అప్పుడు దీర్ఘముఖుడు ప్రభువుకు మరింత దగ్గరగా జరిగి, గొంతు తగ్గించి, మెల్లగా అన్నాడు- "మహారాజా! చిత్రవర్ణుడి సభలోని సంగతులు చెబుతాను- సావధానంగా వినండి. 'యుద్ధమే నిశ్చయం' అని బయలుదేరిన చిత్రవర్ణుడు తన సైన్యంతోపాటు మలయపర్వతానికి ఆవల విడిది చేసి ఉన్నాడు. ఇక నుండీ ప్రతిక్షణం ఏమారక కోటను కాపాడుకోవలసి ఉన్నది.

మరొక్క ముఖ్యవిషయం మనవి చేస్తాను. గతంలో ఆ రాజు చేత అవమానింపబడిన పావురం ఒకదానితో స్నేహం చేసి, ఆ రాజు అనుసరించే వ్యూహాన్ని మొత్తాన్నీఆకళింపు చేసుకున్నాను. చెప్తే నమ్ముతారో నమ్మరో కాని, చిత్రవర్ణుడు పంపించిన గూఢచారి ఒకడెవరోమన కొలువులో చేరి ఉన్నాడని తెలియవచ్చింది. అయితే నాకు ఎక్కువ సమాచారం సేకరించేందుకు అవకాశం లేకపోయింది- ఆ చారుడెలా ఉంటాడో తెలియరాలేదు.

మాటల సందర్భంలో మరొక సంగతి కూడా తెలియవచ్చింది- ఆ రాజ్యపు మంత్రి సూచనలను రాజు చిత్రవర్ణుడు పట్టించుకోలేదట- అందువల్ల అతని మనసు నొచ్చుకున్నదట- అలుకపూని ఉన్నాడట. ఇది కూడా మన ఆశయం నెరవేరేందుకు

కొంత అనుకూలంగానే ఉన్నదని తోస్తున్నది. ఈ సంగతులలో ప్రభువులవారికి ఏది ముఖ్యమనిపిస్తే దాన్ని స్వీకరించగలరు. మొన్న రాత్రి చీకటిపడుతున్నదనగా చిత్రవర్ణుడి అనుచరులు కొందరు నాకు ఎదురుపడ్డారు. పూర్వ పరిచయం కొద్దీ వాళ్ళు నన్ను గుర్తు పట్టినట్లున్నారు- నా మాటతీరును, ముక్కు ముఖాన్ని చూసి- "ఇతను ఆనాటి దీర్ఘముఖుడే కావచ్చు" అని అనుమానంతో తబ్బిబ్బయి, తడబడిపోయి, దగ్గరికి రాబోయారు. వాళ్ళ వాలకం చూసి నా వెంట్రుకలు నిక్క బొడుచుకున్నాయి. ఆలస్యం చేస్తే పని చెడుతుందని గబగబా లేచి వచ్చేశాను. ఆ నా తడబాటుని చూసి నాతోబాటు ఉన్న పక్షులన్నీ కలవరపడి, "ఏమైంది, ఏమైంది?" అని అడగటం మొదలుపెట్టాయి. నేను వాటితో- "ఏమీలేదు- ఏమీ లేదు- ఇప్పుడే వచ్చేస్తాను" అని తేలికగా మాట్లాడి కొన్నిటిని, మోసపుచ్చి కొన్నిటిని- ఇక్కడికి పరుగెత్తి వచ్చాను. మన ధవళాంగుడు ఇంకా అక్కడే ఉన్నాడు" అని తను విన్నది, చూసింది పూర్తిగా వివరించి ఊరుకున్నాడు.

ఇది విన్న మంత్రి కళ్ళు మూసుకొని కొద్ది సేపు ఆలోచిస్తూ ఊరుకున్నాడు. తెలివైనవాడు కాబట్టి, శత్రువు పధకాన్ని ఊహించి, రాజుతో "ప్రభూ! విన్నారా?! ఇక్కడ మనల్ని మోసగించి స్నేహితుడిగా నటిస్తూ ఉన్న వాడెవరో ఉన్నారని మన దీర్ఘముఖుడి మాటలనుండి తెలుస్తున్నది. ఒక విధంగా చూస్తే ఆ గూఢచారి నీలవర్ణుడే కావచ్చును. ఆకారం చేత తప్ప మరేవిధంగాను గౌరవించటానికి పనికిరాదు, ఆ కాకి. అది ఇక్కడికి రావటం వెనుక చాలా కథ ఉండి ఉంటుంది. దీన్ని మనం ఇప్పుడు పట్టించుకోలేదంటే, శరీరంలో నిలవ ఉంచుకొన్న విషం మాదిరి, ఇది మన ప్రాణాలమీదికి తెస్తుంది. వేరే ఆలోచన మాని, నా మాటను ఆలకించండి- ఇతరులను చెడగొట్టటంకోసం దుర్మార్గులైన వాళ్ళు పలు పోకడలు పోతారు. వాళ్లకు ఎల్లప్పుడూ తమ పని ధ్యాస తప్ప వేరేది ఏదీ ఉండదు. గొప్ప

మాయగాళ్ళు వీళ్ళు. వాళ్లని నమ్మామంటే కీడు తప్పదు. ఈ కాకి ఒట్టి గయ్యాళిది- దీని మాటలు నిజమనుకోకండి. ఖచ్చితంగా ఇది సింహళద్వీపం నుండి వచ్చినది కాదు. నిప్పును ఒడిలోమూట కట్టుకున్నట్లు, ఇతన్ని దగ్గర పెట్టుకునేదెందుకు? స్వార్థం కోసం శత్రువు ముచ్చటగా, ఇష్టం అయ్యేట్లు మాట్లాడి, మంచి చేసుకొని నమ్మించి, చివరికి మోసం చేసి చంపేస్తాడు. అట్లాంటివాడితో సావాసానికి ఒప్పుకోవటం అన్నది, నేరుగా ఆ యముడితో పొత్తు పెట్టుకోవటమే తప్ప వేరుకాదు. దుర్మార్గుడైన శత్రువు ఆవు ముఖం పెట్టుకున్న పులిలాగా అన్నింటా సాధు పుంగవుడి మాదిరి ప్రవర్తిస్తుంటాడు. అలాంటివాడితో సావాసాన్ని వదలకపోతే మంచివాడికి ఇక మనుగడ అన్నదే లేదు. 'చిరంజీవి' అనే కాకిని నమ్మి చచ్చిపోయిన గుడ్లగూబల కథ వినలేదా?

ప్రభువులవారికి ఆ కథ చెబుతాను వినండి" అంటూ కాకి గుడ్లగూబల కథ చెప్పసాగింది-

(ఆకథ మళ్ళీ చెప్పుకుందాం..) 

## చమక్కులు








# జ్వరం వస్తే ఏం చేయాలి?

*'మూఢనమ్మకాలతో ఆరోగ్యం పాడుచేసుకోకూడదు' అంటోంది కల్పన. ఎందుకో చదవండి..*

*రచన: A. కల్పన, 5 వతరగతి, p.s తరాలపల్లి, హన్మకొండ, వరంగల్ జిల్లా.*

అనగనగా ఒక ఊరు ఉండేది. ఆ ఊరు పట్టణానికి చాలా దూరంగా ఉండేది. ఆ ఊళ్ళో ఉండే రాములు, సీతాలు ఆలుమగలు. వాళ్ళకు లేకలేక ఒక ఆడపిల్ల పుట్టింది. అయితే ఎందుకో తెలీదు- ఆ పాప ఎప్పుడూ జబ్బు పడుతూ ఉండేది. బిడ్డ ఆరోగ్యం గురించి రాములికి, సీతాలికి చాలా దిగులుగా ఉండేది. పాప ఆరోగ్యం కోసం వాళ్ళు ఎందరో దేవతలకు మొక్కారు. ఎందరో స్వాములను దర్శించుకున్నారు. కోళ్ళను, మేకలను మొక్కులుగా సమర్పించుకున్నారు. అయినా ప్రయోజనం లేదు. పాప ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉండేది.

ఒకసారి పాపకు చాలా జ్వరం వచ్చింది. 'కోడిని

ఇచ్చుకుంటాను తల్లీ, పాపని బాగు చెయ్యి' అని పొరుగూరి దేవతకు మొక్కుకున్నది సీతాలు. ఆ మొక్కును తీర్చుకునేందుకు గాను ఆలుమగలు ఇద్దరూ వెళ్ళి కోడిని బలి ఇచ్చి వచ్చారు కూడాను. ఆ కూరను జ్వరంతో ఉన్నపాపకు తినిపించారు. దాంతో వ్యాధి మరింత ముదిరింది.

అట్లా ఎందుకైందో దేవతనే అడగాలన్నారు అందరూ. 'సరే అడుగుదాం' అని వాళ్ళిద్దరూ పక్క ఊరు పారిజాతం దగ్గరికి వెళ్ళారు. వీళ్ళని చూడగానే పారిజాతం అంతెత్తున లేచి "ఏమిరా, మీ పాపకి భూతం పట్టింది. నాలుగు కోళ్ళు ఇచ్చుకోండి. గొర్రెను కోయండి" అన్నది. ఇంకేముంది, వీళ్ళు అప్పులు చేసి మరీ గొర్రెను కోసారు. మొక్కులన్నీ అప్ప జెప్పి ప్రసాదాన్ని బిడ్డకి కమ్మగా తినిపించారు. దాంతో పాప మరింత లేవలేని స్థితికి చేరుకున్నది. అనారోగ్యానికి విపరీత ఆహారం కూడా తోడవ్వటంతో ఆరోగ్యం మరింత క్షీణించటం మొదలు పెట్టింది.

ఆ సమయంలో ఊరికి వచ్చాడు సోమేష్. సోమేష్ పట్నంలో చదువుతున్నాడు. పాపను చూడగానే అతను "అయ్యో! ఇదేంటి, పాపను డాక్టరుకు చూపించండి వెంటనే. నాలుగు మందులు పడ్డాయంటే బాగైపోతుంది. ఊరికే ఎందుకు, ఇట్లా ప్రాణం మీదికి తెస్తారు?" అన్నాడు.

అప్పటికే అందరి చుట్టూ తిరిగి వేసారి పోయిన రాములు-సీతాలు మరునాడే బిడ్డను తీసుకుని డాక్టరు దగ్గరకు వెళ్ళారు. డాక్టరు పాపను పరిశీలించి పాపకు అరుగుదల సరిగా లేదని, జ్వరంతోబాటు పోషకాహార లోపం ఉందని చెప్పాడు. బిడ్డకు త్వరగా అరిగే తేలికైన ఆహారం ఇవ్వాలని, పండ్లు,కూరగాయలు తినిపించాలని చెప్పాడు. బజార్లో దొరికే కుర్‌పురేలు, నూనె పదార్థాలు పెట్టకూడదన్నాడు. జ్వరం తగ్గేందుకు మందులు కూడా ఇచ్చాడు.

నాలుగు రోజులయ్యేసరికి బిడ్డ ఆరోగ్యం కుదురుకున్నది. అటుపైన వాళ్ళు డాక్టరుగారు చెప్పినట్లుగానే పాపకు పండ్లు,

కూరగాయలు, పాలు ఇవ్వటం మొదలు పెట్టారు. చూస్తూండగానే పిల్ల బలంగా తయారైంది.

ఇప్పుడు ఆ పాపకు ఐదు సంవత్సరాలు. ఆరోగ్య సమస్యలేవీ లేవు. పాప చక్కగా చదువుతుంది. సంతోషంగా ఉంటుంది.

పిల్లలు బలంగా ఎదిగేందుకు సరైన ఆహారం అవసరం. మూఢనమ్మకాలతో ఆరోగ్యాన్ని పాడు చేసుకోకూడదు.

నేర్చుకో!

*కోకిలమ్మ చేసికొన్న పుణ్యంబేమి?*
*కాకి చేసుకొన్న ఖర్మమేమి?*
*మధుర భాషణమున మర్యాద ప్రాప్తించు*
*లలిత సుగుణజాల! తెలుగుబాల!*

కాకి ఏం తప్పు చేసిందని దానికా అపనిందలు?, కోకిల ఏం పుణ్యం చేసుకున్నదని, దానికా మెప్పుకోలులు? చక్కటి మాటతీరు వల్లనే మర్యాద లభిస్తుంటుంది.

ఇనుడు వెలుగునిచ్చు; ఘనుడు వర్షమునిచ్చు
గాలి వీచు; చెట్లు పూలు పూచు
సాధుపుంగవులకు సహజలక్షణమిది
లలిత సుగుణజాల! తెలుగుబాల!

సూర్యుడు వెలుతురును ఇస్తూ ఉంటాడు; మేఘుడు వర్షాన్ని కురిపిస్తూ ఉంటాడు; గాలి వీస్తూ ఉంటుంది; చెట్లు పూలు పూస్తూ ఉంటాయి. మంచివాళ్ళకు ఇట్లా 'ఇస్తూ ఉండటం' అనేది సహజ లక్షణం.

ముందు వెనుక గనుము, తొందరపడకుము
ఆపదలకు మౌఢ్యమాస్పదంబు
అరసి చేయువాని వరియించు సంపదల్
లలిత సుగుణజాల! తెలుగుబాల!

ముందు వెనకలు ఆలోచించు. తొందరపడకు. మూర్ఖత్వం అన్ని ఆపదలకూ మూలం. ఏ పనియినా అర్థం చేసుకొని చేస్తూండు.




# దయ్యాల భయం

*"మనం ధైర్యంగా ఉంటే సరి- మనల్ని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు" అని రాస్తున్నాడు శ్రీధర్. తను చిరునామా సరిగా రాయలేదు, ఏ బడో, ఏమో మరి?!*



*రచన: టి.శ్రీధర్, తొమ్మిదవ తరగతి, ప్రత్తిపాడు, గుంటూరుజిల్లా.*

అనగనగా ఒక ఊరిలో ఇద్దరు ప్రాణ స్నేహితులు ఉండేవాళ్ళు. వాళ్ళ పేర్లు సుభాష్, ద్విజేంద్ర. ప్రతిరోజూ సాయంత్రం వాళ్ళిద్దరూ వాళ్ళ స్నేహితులతో క్రికెట్ ఆడుకునేందుకు పోయేవాళ్ళు. ఆ ఆట స్థలం అడవిని ఆనుకొని ఉండేది. ఆ అడవిలో దయ్యాలు ఉంటాయని అందరికీ అనుమానం. "ఎందుకురా, పిల్లలూ? అక్కడికెందుకు వెళ్తారు?" అని అడిగేవాళ్ళు చాలామంది. అయినా పిల్లలకు ఆ స్థలం అంటే చాలా ఇష్టంగా ఉండేది. క్రికెట్ ఆడుకునేందుకు అది అంత అనువుగా

ఉండేది మరి.

ఒకసారి పిల్లలందరూ అక్కడ క్రికెట్ ఆడుతూ ఉన్నప్పుడు, సుభాష్ బంతిని ఎంత గట్టిగా కొట్టాడంటే -ఆ బంతి ఎగ్గిరి- నేరుగా అడవిలోనే పడింది! అడవిలోకి వెళ్ళటం ఎవ్వరికీ ఇష్టంలేదు! దాంతో "నువ్వే కద, బంతిని కొట్టింది? అందుకని బంతిని నువ్వే తేవాలి" అని పట్టుపట్టారు మిగిలిన పిల్లలు.

సుభాష్‌కి మామూలుగానే దయ్యాలంటే భయం. ఇప్పుడేమో సాయంత్రం అయిపోయింది- చీకటి పడబోతున్నది. ఈ సమయంలో అడవిలోకి వెళ్ళి బంతిని వెతుక్కురావాలంటే ఎలాగ? వాడు కొంచెంసేపు తటపటాయించాక, స్నేహితుడు ద్విజేంద్రవైపు చూస్తూ "సరేలేరా, తెద్దాం. నాకు తోడుగా నువ్వూ వస్తావా, మరి?" అన్నాడు. "సరేలేరా, నేను వస్తానులే!" అని సుభాష్‌కి తోడుగా వచ్చాడు ద్విజేంద్ర.

వీళ్ళు సగం దూరం వెళ్ళాక, ఒక మర్రి చెట్టు దగ్గర కనబడింది బంతి. బంతిని చూడగానే వాళ్ల ప్రాణం లేచివచ్చినట్లయింది. సుభాష్ ముందుకెళ్ళి బంతి వైపుకు చెయ్యి చాచాడో లేదో, విపరీతమైన గాలి వీచింది. కొద్దిదూరంలోనే గాలి సుడి తిరిగింది కూడాను. పిల్లలిద్దరికీ చాలా భయం వేసింది. అంతలోనే ద్విజేంద్ర ముందుకు దూకి, బంతిని చేతులోకి తీసుకొన్నాడు. ఇద్దరూ వెనక్కి తిరిగి చూడకుండా పరుగు మొదలు పెట్టారు.

వాళ్ళు ఇంకొన్ని అడుగులు వేస్తే చాలు- అడవిని దాటేస్తారు. అంతలోనే వాళ్ళకు రెండు పిల్ల దయ్యాలు ఎదురుపడ్డాయి. రెండూ తెల్లటి అంగీలు వేసుకొని, ఇకిలిస్తూ దారికి అడ్డంగా నిలబడి ఉన్నాయి! వాటి నీడలు పొడుగ్గా దారి వెంబటి పరచుకొని ఉన్నాయి. రెండూ "ఊఁ.. ఊఁ.." అంటున్నాయి.

దయ్యాలను చూడగానే సుభాష్‌కి కళ్ళు తిరిగినట్లయింది. వాడు తటాలున క్రింద పడి మూర్ఛపోయాడు. ద్విజేంద్ర మటుకు ధైర్యంగా నిలబడి చూశాడు దయ్యాలని. అవి ఇకిలిస్తూ ఉన్నాయి, కానీ వాటి పెదవులు

కదలటం లేదు.. వాటి గొంతులు కూడా ఎక్కడో పరిచయం ఉన్నట్లుగానే అనిపిస్తున్నాయి. అంతలో మళ్ళీ గాలి వీచింది. గాలికి దయ్యం వేసుకున్న తెల్ల అంగీ కొంచెం కదిలింది. ఒక్క అర్ధనిముషం పాటు దాని వెనక ఉన్న గీతల చొక్కా బయట-పడింది. ద్విజేంద్ర మెదడు చురుకుగా పని చేసింది..ఇవి దయ్యాలు కావు- వీడు-.. సతీష్‌గాడు!

వెంటనే ద్విజేంద్ర "ఒరేయ్! సతీష్! మాస్క్ వేసుకుంటే నువ్వు దయ్యం అయిపోతావ-నుకున్నావురా? పిచ్చి పిచ్చి వేషాలు మాను. సుభాష్‌గాడికి అసలే భయం ఎక్కువ" అని అరిచాడు.

అది వినగానే సతీష్, వాడితోబాటు దయ్యం వేషం వేసుకొని ఉన్న చంద్ర ఇద్దరూ మాస్కులు తీసేసి నవ్వారు. అంతలోనే క్రింద పడి ఉన్న సుభాష్‌ని చూసి వాళ్ళ నోళ్ళు మూతపడ్డాయి .

"ఒరేయ్! పాపం వీడు నిజంగానే చాలా భయపడ్డట్లున్నాడురా!" అని ఇద్దరూ ఏడుపు ముఖం పెట్టారు.

"ఏం కాలేదులే, కొంచెం నీళ్ళు తెచ్చి వీడి ముఖం మీద చల్లండి. ముందు ఆ మాస్కులు తీసి దాచి పెట్టండి, మళ్ళీ బెదురుకుంటాడు వీడు" అన్నాడు ద్విజేంద్ర.

ముఖంమీద నీళ్ళు పడగానే లేచి కూర్చున్నాడు సుభాష్- "దయ్యాలు నన్ను ఎత్తుకెళ్ళాయా?" అంటూ.

"దయ్యాలు కాదు, గియ్యాలు కాదు- అవి వీళ్ళిద్దరే! అయినా నువ్వు ఊరికే అట్లా బెదురుకోకూడదు. ప్రమాదాలు ఎదురైన-ప్పుడు ధైర్యంగా నిలబడాలిగాని ఇట్లా మూర్ఛపోతే ఎలారా?" స్నేహితుడు సున్నితంగా మందలిస్తుంటే సిగ్గుగా నవ్వాడు సుభాష్. 

**రెండు తలనొప్పులు!**

నవ్వు!

డాక్టర్: తలనొప్పా? అయితే రెండు మాత్రలు వేసుకో

వెంగళప్ప: రెండెందుకండీ, ఒకటి చాలు. నాకున్నది ఒక్కటే తలకాయ...!



# దేవుడిచ్చిన కొడుకు

*బాగా పేరొందిన ఆంగ్ల కథల కోవకు చెందినది ఈ కథ. చక్కని ఈ కథని మీరూ చదవండి. ఎలా ఉందో చెప్పండి..*

*కథనం: మానస, 10 వతరగతి, zpps తరాలపల్లి, హన్మకొండ, వరంగల్ జిల్లా.*

తిమ్మాపురంలో గోపన్నకు పొలం వుంది. కానీ వరుసగా మూడేళ్ళు సరిగా వర్షాలు కురియక పంటలు పండలేదు. ఆ కరువులోనే తల్లిదండ్రులు ఇద్దరూ జబ్బులతో చనిపోవటంతో గోపన్న ఒంటరివాడై పోయాడు. ఉన్న ఊళ్ళో బ్రతకటం కష్టమైంది. రాజధాని- విజయనగరానికి వెళ్ళాడు, ఏదైనా పని దొరికితే చేసుకుందామని. పొట్ట చేత్తో పట్టుకుని నగరానికి రానైతే వచ్చాడుగానీ అతనికి ఏ పనీ దొరకడం లేదు. నగరానికి కొత్త. తెలిసిన వాళ్ళెవరూ లేరు. 'తెలిసినవాళ్ళు ఎవరైనా పరిచయం చేస్తే తప్ప పనిలో పెట్టుకోలేం' అని వ్యాపారస్తులు నిర్మొహమాటంగా చెప్పారు. గుడిలో పెట్టే ప్రసాదాలు, అన్నదానాలతో కడుపు నింపుకుంటున్నాడు గోపన్న.

ఆరోజున అతనికి తినడానికి ఏమీ దొరకలేదు. "ఇక లాభం లేదు. మంచిగా

బ్రతుకుదామంటే ఎవ్వరూ పని ఇవ్వడం లేదు. దొంగతనం చేసైనా బతకాలి" అనుకున్నాడు . ఊరి చివరన ఒక ఇంట్లో ముసలమ్మ ఒంటరిగా ఉండటం గమనించాడు. చీకటి పడే వరకూ వేచిఉన్నాడు. వీధంతా సద్దుమణిగాక తలుపు తట్టాడు.

ముసలమ్మ తలుపు తెరవగానే "చంపుతా! మర్యాదగా నగలు, నగదు ఇవ్వు!" అని కత్తితో బెదిరిద్దామనునుకున్నాడు.

అంతలోనే తలుపు తీసింది- ఆ ఇంట్లో ఉండే శాంతమ్మ. తలుపు తీసీ తీయగానే గోపన్నను చూసి నవ్వింది. "రా నాయనా! నీ కోసమే ఎదురు చూస్తున్నాను" అన్నది.

గోపన్న ఆశ్చర్యపోయాడు. "నేను వస్తున్నట్లు నీకు ఎట్లా తెలుసు?" అని అడిగాడు.

"ఇవాళ్ళ మా ఆయన చనిపోయిన రోజు. ఇంటికి ఎవరొచ్చినా భోజనం పెట్టాలని ఆచారం పెట్టుకున్నాను. ఈ వీధిలో అంతా ధనవంతులు. 'ఇవాళ్ళ ఇంతవరకూ ఎవరూ రాలేదు. చీకటి పడిపోతున్నదే' అనుకున్నాను. అంతలోనే నువ్వు వచ్చి తలుపు తట్టావు. మా ఆయనే నిన్ను ఇక్కడికి పంపి ఉంటాడు. మా కొడుకంత వయసు నీది. రా, కాళ్ళు కడుక్కో. ముందు కాస్తంత అన్నం తిందువు" అన్నది.

గోపన్న తను వచ్చిన పని మర్చిపోయాడు. కాళ్ళు కడుక్కొని వచ్చి కూర్చున్నాడు. శాంతమ్మ అతనికి కడుపు నిండా భోజనం పెట్టింది.

ఆమె గురించిన వివరాలు అడిగాడు గోపన్న. శాంతమ్మ భర్త, కొడుకు కూడా యుద్ధంలో చనిపోయారు. తను ఒంటరిగా జీవిస్తున్నది.

ఉప్పు తిన్న ఇంటికి ద్రోహం చెయ్యకూడదని నిర్ణయించుకున్న గోపన్న భోజనం చెయ్యగానే వెళ్లిపోయేందుకు సిద్ధ పడ్డాడు. కానీ శాంతమ్మ ససేమిరా పోనివ్వలేదు. "ఇంత రాత్రి ఎక్కడికి వెళ్తావు? ఇవాల్టికి ఇక్కడే పడుకుని ఉదయం వెళ్దువులే" అన్నది.

గోపన్న నిద్రపోతుండగా తలుపు చప్పుడైంది. రాజభటులు వచ్చారు. శాంతమ్మ తలుపు తీసి మాట్లాడింది- "అమ్మా! నగరంలోకి

దొంగలు ప్రవేశించారని సమాచారం వచ్చింది. జాగ్రత్తగా ఉండు" అంటున్నారు వాళ్ళు. ఇంట్లో పడుకుని వున్న గోపన్నను చూసి "ఎవరు, ఇతను?" అని అడిగారు.

"పరాయివాడు కాదు, వీడు నా కొడుకే" చెప్పింది శాంతమ్మ.

రాజభటులు జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయారు.

గోపన్నకు ఏడుపు వచ్చేసింది. శాంతమ్మ కాళ్ళ మీద పడి ఏడుస్తూ 'నేను దొంగతనం కోసమే వచ్చానమ్మా' అని నిజం చెప్పేశాడు.

శాంతమ్మ నవ్వింది. "పర్వాలేదులే బాబూ. పరిస్థితుల ప్రభావం వల్ల మంచి మనిషే అలా దొంగలా ప్రవర్తిస్తాడు. ఇందులో నీ తప్పేం లేదులే" అని ఓదార్చింది.

"అమ్మా! నీకు ఎవరూ లేరు; నేను దిక్కులేని వాడిని. నువ్వు సరేనంటే నీ దగ్గరే పని పాటలు చేసుకుంటూ నిజాయితీగా బ్రతుకుతా" వేడుకున్నాడు గోపన్న.

"అంతకంటేనా! నిన్ను దేవుడిచ్చిన కొడుకు అనుకుంటాను, నా దగ్గరే వుండిపో" అన్నది శాంతమ్మ. 





# దొరికిపోయిన పిల్లి!

*రచన: తులసి, పదవ తరగతి, నందన గ్రామీణ పాఠశాల, చేతన, చౌడవరం, గుంటూరుజిల్లా.*

అనగనగా ఒక చక్కని అడవి. ఆ అడవిలో జంతువులన్నీ కలిసి సంతోషంగా జీవిస్తూ ఉండేవి. వేటి పని అవి చేసుకుంటూ, వేటికి కావలసిన ఆహారాన్ని అవి సంపాదించు- కుంటూ సుఖంగా జీవిస్తుండేవి.

అదే అడవిలో నివసిస్తూండేది ఒక పిల్లి. దానిది చాలా స్వార్థబుద్ధి. కష్టపడకుండానే సుఖం రావాలనుకునే స్వభావం దానిది. ఒకరోజున దానికి ఓ 'భోజనశాల' కట్టాలనే ఆలోచన కలిగింది. అయితే భోజనశాలను కట్టేందుకు అవసరమైన డబ్బు లేదు, దాని దగ్గర.

ఆ అడవిలోనే నివసించేవి నాలుగు స్నేహితులు- రామ చిలక, గోరింక, పావురం, కోయిల. వాటి స్వభావం పిల్లి స్వభావానికి పూర్తిగా వ్యతిరేకం. నిస్వార్థజీవులు అవి. వాటికి దాన గుణం ఉంది. తమ సహాయం వల్ల ఎవరైనా జీవితంలో ఎదుగుతారు

అనుకుంటే అవి ఎంత డబ్బు ఇవ్వడానికైనా, చివరికి ప్రాణాలను సైతం ఇవ్వడానికి సిద్ధపడేవి.

పిల్లికి ఈ నాలుగు పక్షుల గుణం ఎలాంటిదో తెలుసు. వాళ్ళ మంచితనాన్ని తన స్వార్థం కోసం ఉపయోగించుకోవాలనుకున్నదది. నాలుగింటిదగ్గరా వేరు వేరుగా అప్పులు చేసి, వేరు వేరు గడువులు తీసుకున్నది.

అట్లా నలుగురి సొమ్ముతోటీ పిల్లి ఓ చక్కటి భోజనశాల నిర్మించుకున్నది. అయితే దానికి ఆ డబ్బును తిరిగి ఇచ్చే ఉద్దేశం ఏ మాత్రం ఇష్టం లేదు! అందుకని అది ఒక పన్నాగం పన్నింది. అదే అడవిలో నివసించే గ్రద్ద వద్దకు వెళ్ళి, ఈ నలుగురు మిత్రులను గురించి చాలా చెడుగా చెప్పింది. అడవిలో అందరినీ అవి పీడిస్తున్నాయనీ, 'అవి ఎప్పుడు పోతాయా' అని అందరూ ఎదురు చూస్తున్నారనీ చెప్పింది. అందరి మేలూ కోరి, తను కొంతకాలం పాటు గ్రద్దకు కావలసిన ఆహారాన్ని, వసతిని కల్పిస్తానని ; గ్రద్ద ఎలాగో ఒకలాగా ఆ నాలుగు పక్షులను చంపెయ్యాలని, అందుకుగాను తను కొంత డబ్బు కూడా ఇస్తాననీ చెప్పి, ఆ గ్రద్దను తనతో పాటు ఇంటిలోనే ఉంచుకున్నది పిల్లి.

ఇలా కొంత కాలం గడిచింది. ఒకసారి ఈ నలుగురు స్నేహితులు కలిసి అవీ ఇవీ ముచ్చటించుకుంటుంటే పిల్లి ప్రస్తావన వచ్చింది. ఆ పక్షులకు ఎందుకో పిల్లిపై అనుమానం కలిగింది. 'ఓసారి చూసొద్దాం' అని బయలుదేరాయవి. దారిలో కనిపించిన ప్రతి జంతువూ వాటికి పిల్లిని గురించి చెడుగానే చెబుతున్నాయి- "పిల్లిది స్వార్థబుద్ధి. ఈ మధ్య అది ఒక గ్రద్దను కూడా తన ఇంటిలోనే పెంచుతోంది".

తెలివిగల ఆ పక్షులు పిల్లిలేని సమయం చూసి ఇంటి ముందుకు వెళ్ళాయి. దూరంగానే నిలబడి గ్రద్దతో స్నేహపూర్వకంగా మాట్లాడాయి- "గ్రద్ద నేస్తమా! నువ్వు క్రూర జాతికి చెందిన దానివే కావొచ్చు. కానీ నీకూ మనసుంది కదా? ఈ పిల్లి చెడ్డది అని నీకు తెలీదా? మేము ఎవ్వరికీ ఏ అపకారమూ తలపెట్టలేదే? అట్లాంటి మమ్మల్ని చంపడానికే

పిల్లి దగ్గర ఉంటున్నావు నువ్వు. ఇది న్యాయమా?" అని అడిగాయి.

గ్రద్దకి ఆ సరికి పిల్లి గురించి తెలిసిపోయింది. నలుగురు స్నేహితులూ తనను పలకరించిన విధానం చూసి దానికి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "నన్ను క్షమించండి. నాకు ఇష్టం లేక పోయినా ఈ పనికి ఒప్పుకున్నాను. కాసింత డబ్బు కోసం ఆశపడ్డాను. ఇప్పుడు నేను ఏం చేయాలో మీరే చెప్పండి" అన్నదది.

"మనందరం కలసి పిల్లి బుద్ధిని మార్చాలి. తగిన గుణపాఠం చెప్పి, దాన్ని మంచి దారికి తీసుకొని రావాలి. సాయం చేస్తావా?" అని అడిగాయి పక్షులు. "ఓ! తప్పకుండా సాయం చేస్తాను. అంతకంటే ఏం కావాలి?" అన్నది గ్రద్ద. "నీనుండి ఆ మాత్రం సహకారం ఉంటే చాలు-మిగతాది మేం చేస్తాం" అని పక్షులు నాలుగూ వెళ్ళి అడవిలోని జంతువులన్నిటినీ కలిసి పిల్లి గురించి చెప్పాయి. మరునాడు ఉదయం తొమ్మిది గంటలకల్లా భోజనశాల దగ్గరికి రమ్మని వాటిని ఆహ్వానించి వచ్చాయి.

జంతువులన్నీ వచ్చి పిల్లి ఇంటి చుట్టూ కొంతదూరంలో నిశ్శబ్దంగా కూర్చున్నాయి. పక్షులు నాలుగూ ఒక్కటొక్కటిగా లోపలికి వెళ్ళి, "డబ్బు కోసం వచ్చాం" అన్నాయి. "ఓ, దానికేం? నలుగురి అప్పు ఒకేసారి తీర్చేస్తాను రండి. మీ డబ్బును పువ్వుల్లో పెట్టి తెచ్చిస్తాను. కూర్చోండి" అని వాటిని అక్కడ కూర్చోబెట్టి, పిల్లి లోపలికి వెళ్ళింది. లోపలికి వెళ్ళగానే "అవిగో, వచ్చాయి చూడు- దొంగ పక్షులు. వాటి పని పట్టు" అన్నది గ్రద్దతో.



గ్రద్ద పరుగున వచ్చి, పక్షులు నాలుగింటినీ ఇంటిముందున్న పొదల్లోకి తరిమింది. కొద్ది సేపటికి వెనక్కి తిరిగి వచ్చి, పిల్లితో "నీ పని పూర్తయ్యింది. నాలుగు పక్షులనూ చంపేశాను. నాకు ఇవ్వవలసిన సొమ్ము

ఇవ్వు. నేను వెళ్తానిక. అయినా నువ్వు బలే పిల్లివే? నీ పని పూర్తి చేసుకోటానికి ఎంత మందినైనా ఇలాగే చంపించేట్లున్నావే?!" అన్నది.

"అవును! నాకెవరూ అడ్డు రాకూడదు. అందుకేగా, మరి ఆ నాలుగు పక్షులనూ సునాయాసంగా అడ్డు తొలగించు-కున్నది?"జవాబిచ్చింది పిల్లి గర్వంగా నవ్వుతూ.



మరుక్షణం అడవిలోని జంతువులన్నీ పిల్లి ఇంటిలోకి వచ్చేశాయి. "దొరికిపోయావు పిల్లీ! నీ వ్యవహారం అంతా రట్టు అయ్యింది. నీ గురించి అందరికీ తెలిసిపోయింది. ఇకపై నీతో ఎవరూ కలవరు; మాట్లాడరు. నువ్వు ఒక్కదానివీ ఎలా బ్రతుక్కుంటావో బ్రతుక్కో. నువ్వు కట్టిన ఈ ఇళ్ళూ, భోజనశాలలూ అన్నీ ఇకమీద ఉమ్మడి ఆస్తులు ఐపోతాయి" అని అరిచాయి అన్నీ.

ఇట్లా జరుగుతుందని ఊహించని పిల్లి బిత్తరపోయింది. భయపడింది. కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది. తనని బహిష్కరించవద్దని ప్రాధేయపడింది. "తప్పు తెలుసుకున్నాను. క్షమించండి. ఇకపైన నీతిగా జీవిస్తాను. నన్ను నమ్మండి" అని ఏడ్చింది.

దయగల ఆ పక్షులు నాలుగూ ముందుకు వచ్చి "నిన్ను మార్చడానికే మేమంతా ఇలా చేసాం తప్ప, నిన్ను బాధ పెట్టాలనే ఉద్దేశం మాకు ఏ మాత్రం లేదు" అన్నాయి.

జంతువులన్నీ పక్షుల డబ్బుల్ని తిరిగి ఇప్పించాయి. పిల్లితో ఎప్పటిలాగానే స్నేహంగా ఉండసాగాయి. పిల్లి తన బుద్ధిని మార్చుకున్నది. నీతిగా జీవించటం మొదలుపెట్టింది. 

నవ్వు!

భార్య: బీరకాయలు తెమ్మంటే టెంకాయలు తెచ్చారేంటండీ?

వెంగళప్ప: నిన్న డాక్టర్ దగ్గరికెళ్ళినప్పుడు పీచు బాగా ఉన్న కూరలు తినమన్నాడుగా...!



# మూడు బొమ్మలు

*పెద్దవాళ్ళు రాసినట్లు గొప్పగా ఉన్నది, చక్కని ఈ కథ- చదివి చూడండి మీరున్నూ..!*
*కథనం: సుభాష్, 8 వతరగతి, ఉపాధ్యాయ ఇంగ్లీష్ మీడియం స్కూల్, చౌడవరం, గుంటూరుజిల్లా.*

రాజ్యానికి ఓ దివాన్ కావాలని ప్రకటన ఇచ్చాడు, చంద్రగిరిని పాలించే విజయసేనుడు.

ప్రకటన విని తన దగ్గరకు వచ్చే వారికి ఆయన మూడు బొమ్మలు చూపించి వాటి మధ్య తేడా చెప్పమనేవాడు.

'మూడూ ఒకేలా ఉన్నాయి. తేడాలేదు' అనే సమాధానమే అందరి నుంచీ వచ్చేది.

అది వినగానే "అవునా! అయితే మీరిక వెళ్ళొచ్చు. మీ చిరునామా బయట వ్రాసి వెళ్ళండి" అని ఇంటికి పంపించేసేవాడు రాజు. ఇట్లా చాలామంది రావటం, పోవటం జరిగింది.

అట్లా ఇట్లా ఈ సంగతి చంద్రగిరి

గురుకులంలో పాఠాలు చెప్పే గురుప్రసాదుకు తెలిసింది. సునిశిత దృష్టి, పరిశీలనా శక్తి ఉన్న గురుప్రసాదు సభకు వెళ్ళి రాజుగారిని కలిసాడు. "పరీక్షకు నేను సిద్ధం మహారాజా" అన్నాడు.

రాజుగారు బొమ్మల్ని చూపించారు. గురుప్రసాద్ బొమ్మల్ని కాసేపు పరిశీలించి "ప్రభువులు అనుమతిస్తే, నేను గదిలో ఆమూలన ఉన్న చీపురు పుల్లనొకదాన్ని వాడుకుంటాను" అన్నాడు.

"ఓс! ఎంచక్కా వాడుకోండి" అన్నాడు రాజు చిరునవ్వు నవ్వుతూ.

గురుప్రసాదు మొదటి బొమ్మను చేతులోకి తీసుకొని, దాని చెవిలో చీపురుపుల్ల దూర్చాడు. అది మరో చెవిలోంచి బయటకు వచ్చింది.

అతను నవ్వి, రెండో బొమ్మ చెవిలోకి దూర్చాడు పుల్లని. అది దాని నోట్లోంచి బయటికి వచ్చింది.

అతను మళ్ళీ నవ్వి, ఈసారి మరింత ఉత్సాహంగా మూడోబొమ్మను పట్టుకొని దాని చెవిలోకి పుల్లను దూర్చాడు- ఈసారి పుల్ల అసలు బయటికే రాలేదు!

"తేడా గమనించారుగా, ప్రభువులవారు?!" అన్నాడు గురుప్రసాదు నవ్వుతూ.

"బాగానే ఉంది లెండి, మరి దీని అర్థం ఏంటంటారు?" అడిగాడు విజయసేనుడు, తనూ నవ్వుతూ.

"ఈ మొదటి బొమ్మలాంటి వారు చాలా మంది ఉంటారు మహారాజా! వీళ్ళంతా విషయాలను ఒక చెవితో విని మరో చెవితో వదిలేస్తారు. దేన్నీ సొంతం చేసుకోలేరు.

ఇక రెండో బొమ్మ లాంటి వాళ్ళు వేరే రకం. ఇట్లాంటి వాళ్ళు దేన్నీ దాచుకొని ఉండలేరు. తాము విన్నది విన్నట్లే అందరికీ చెబుతుంటారు. పుకార్లకు పట్టుగొమ్మలు వీళ్ళు.

ఇక ఈ మూడోబొమ్మలాంటి వాళ్ళు చాలా అరుదుగా ఉంటారు. వీళ్ళు విషయాలు అన్నిటినీ జాగ్రత్తగా వింటారు- బాగా

ఆకళించుకొని, ఏది మంచో-ఏది చెడో చూసుకొని సరైన నిర్ణయం తీసుకుంటారు. చూసేందుకు ఒకేలాగా ఉండే బొమ్మల్లో ఎంత తేడా ఉందో చూడండి, అచ్చం మనుషుల్లో లాగానే!" వివరించాడు గురుప్రసాదు.

అతడి వివరణ విన్న విజయసేనుడు "నేను ఇన్నాళ్లుగా వెతుకుతున్నది మీలాంటి వ్యక్తి కోసమే! మీరు నా దగ్గరే ఉండి దివానుగా రాజ్య పాలనలో సహకరించండి" అని వినమ్రంగా చెప్పాడు.

చమక్కు!





# పిల్లి తెలివి

*మరో పొడుపుకథల కథ ఇదిగోండి.. మనకు ఎన్ని పొడుపు కథలొచ్చో అన్ని కథలు రాయచ్చు కదూ, ఇలాగ?!*
*రచన: బి.జ్యోతి, 9 వతరగతి, z.p.h.s. పాలకొండ, శ్రీకాకుళం.*

అనగనగాఒక ఊరిలో ఒక పిల్లి ఉండేది. ఒక రోజున దానికి ఒక కుక్క కనిపించింది. పిల్లికి చాలా భయం వేసింది. ఒకటే పరుగు పెట్టింది. అయినా కుక్క దాన్ని వదలలేదు. వెంటపడి, ఇంక ఎటూ పోకుండా అడ్డుపడ్డది. "ఇప్పుడెలా తప్పించుకుంటావు? ఇంక నిన్ను వదిలి పెట్టేది లేదు" అంది. పిల్లి గజగజ వణికింది. "నన్ను వదిలి పెట్టండి కుక్కగారూ! నేను చాలా తెలివైన పిల్లిని" అని వేడుకున్నది కుక్కని.

కుక్క కొంచెం ఆలోచించింది. "తెలివి గల పిల్లివా? అయితే నేనడిగే పొడుపుకథలకు సరైన జవాబులు చెప్పు- వదిలి పెడతాను. లేకుంటే ఈ పూటకు నువ్వే నా ఆహారం!

అసలు నాకు తెలివైన పిల్లులంటే చాలా ఇష్టం!" అంది.

పిల్లికి కొంచెం భయం వేసింది. అయినా చేసేదేముంది? వణుకుతూనే 'సరే, కానివ్వు, అడుగు' అన్నది. కుక్క అడగటం మొదలుపెట్టింది:

కుక్క:- నాలుగుకాళ్ళుండు నడయాడలేదు, చేతులు రెండుండు పనిచేయలేవు- అయినా వచ్చిన అతిథులకు మర్యాద చేస్తుంది, కూర్చుండ బెడుతుంది గౌరవిస్తుంది- ఏంటది?

పిల్లి:- కుర్చీ!

కుక్క:- సరే, ఇది చెప్పు- "తోక ఉంటుంది కానీ జంతువుకాదు, ఆకాశంలో ఎగురుతుంది కానీ విమానంకాదు- ఏమిటో చెప్పు?"

పిల్లి:- గాలిపటం!

కుక్క:-ఊఁ..కొంచెం తెలివి ఉంది, నీకు. ఇది చెప్పు- "అమ్మా అంటే కలుస్తాయి, నాన్న అంటే విడిపోతాయి- ఏంటవి?"

పిల్లి:- పెదాలు!

కుక్క:- బాగుందోయ్! ఇంకోటి అడుగుతాను చూడు- "ఒంటినిండ కన్నులుండు ఇంద్రుడుకాదు, కంఠమందు నలుపు కాడు శివుడు, ఫణుల పట్టి చంపు- పక్షీంద్రుడా? కాదు! మరి యెవరంటావు అది?"

పిల్లి:- నెమలి !

కుక్క:- ఓహో! అన్నీ చెప్పేస్తున్నావే! ఇది చూడు- "చెయ్యనికుండ , పొయ్యని నీళ్ళు, వెయ్యని సున్నం, తియ్యగనుండు- అదేమిటి?"

పిల్లి:- కొబ్బరికాయ!

కుక్క:- అబ్బ ఏం తెలివి! "రాజుగారి టవల్- ఎంత ఎండ ఉన్నా ఎండదు! ఏంటా టవల్, ఏమా కథ?"

పిల్లి:- నాలుక!

కుక్క:- "అంతులేని చెట్టుకు అరవై కొమ్మలు. కొమ్మకొమ్మకూ కోటి పువ్వులు. అయినా ఉన్నవి రెండే రెండు కాయలు.. ఏంటి, ఈ

వివరం?"

పిల్లి:- ఆకాశం, నక్షత్రాలు, సూర్య-చంద్రులు!

కుక్క:- "బానే చెబుతున్నావు పిల్లీ! "గూటిలో ఉంటాము గువ్వలంకాదు. చుట్టూ కాపలా ఉంటుంది కానీ రాజులంకాదు. న్యాయ ధర్మాలు తెలుసు కానీ న్యాయమూర్తులంకాదు- ఎవరం? మేం ఎవరం?

పిల్లి:- కళ్ళు!

కుక్క:- వావ్! బాగా చెప్పావు. ఇది ట్రై చెయ్యి. "నూతికి నూరుకన్నాలు- ఏంటది?"

పిల్లి:- జల్లెడ!

కుక్క:- సరే, సరే, ఇది కూడా చెప్పేస్తావేమో మరి, చూడు- "తండ్రి గరగర, తల్లి పీచుపీచు, బిడ్డలు రత్నమాణిక్యాలు ఏమిటది?"

పిల్లి:- పనసపండు !

కుక్క: వావ్! చిన్నదానివైనా తెలివిగా జవాబులుచెప్పావు. నీలాంటి తెలివిగల-వాళ్ళంటే నాకు చాలా ఇష్టం! ఇకనుండీ మనిద్దరం స్నేహితులం .

కుక్క పిల్లిని చాలా మెచ్చుకున్నది. వదిలి పెట్టేసింది.

పిల్లి సంతోషంగా బయటికి పరుగు తీసింది. ✷

నవ్వండి!

**అర్థ సత్యం!**

వినయ్: నాన్నా! పౌష్ఠికాహారం, సంపూర్ణాహారం అంటే ఏమిటి?

బేరర్ సుబ్బారావు: పౌష్ఠికాహారం అంటే ప్లేట్‌మీల్స్, సంపూర్ణ ఆహారం అంటే ఫుల్‌మీల్సురా!

**పని లేని పని!**

గిరి: మనకెప్పుడూ ఓటమి రాకూడదంటే ఏం చేయాలి?

హరి: ఏమీ చేయకుండా ఉంటే సరి! అసలు ప్రయత్నమే చేయొద్దు...!




# మంత్రగాడు-విక్రముడు

*జానపద కథల్లో ఏవి ఎప్పటివో కనుక్కోవటం ఒకింత కష్టమే. మీరు ఎప్పుడైనా విన్నారా, ఈ కథని?*
*సేకరణ, కథనం: కె.ఫణీంద్ర, 7 వతరగతి, J.N.V, లేపాక్షి, అనంతపురం జిల్లా.*

విక్రమార్కుడు ఉజ్జయినిని పరిపాలిస్తున్న సమయంలో ఆయన రాజ్యంలోనే మంత్రగాడు ఒకడు ఉండేవాడు. అతను తపస్సు చేసి గొప్ప శక్తులు సంపాదించాడు. కానీ ఏమిటో, అతనికి ఉన్నంత కోపం, అసహనం వేరే ఎవ్వరికీ ఉండవు.

ఒకసారి అతను నిద్రపోతూంటే పిల్లి ఒకటి ఆ వైపుకి రాబోయింది. వస్తూ వస్తూ అది అక్కడే ఉన్న ఒక కుండను తన్నింది. వెంటనే కుండ కాస్తా క్రింద పడి ఢమాలున పగిలిపోయింది.

ఆ శబ్దానికి తటాలున నిద్ర లేచాడు మంత్రగాడు. "తన నిద్రను చెడగొట్టిన పిల్లే, తన కుండను కూడా పగల గొట్టింది!" 'నా నిద్రను చెడగొడతావా, నువ్వొక కట్టెలా

మారిపో!' అని పిల్లిని శపించి తన కమండలంలోని నీళ్ళు చల్లాడు అతను. అంతే- మరుక్షణం ఆ పిల్లి కాస్తా కట్టెలాగా మారిపోయింది.

తర్వాత మంత్రగాడు బయటకు వెళ్ళి సూర్య నమస్కారాలు చేస్తుండగా కాకి ఒకటి ఆ పై కొమ్మ మీదే కూర్చొని రెట్ట వేసింది. మంత్రగాడికి చాలా కోపం వచ్చేసింది. కాకివైపుకు కమండలంలోని నీళ్ళు చల్లుతూ "నామీదే రెట్ట వేస్తావా? నువ్వొక బండరాయిగా మారిపో" అన్నాడు గట్టిగా. మరుక్షణం ఆ కాకి కాస్తా బండరాయిలా మారిపోయింది.

కాకి రెట్ట మంత్రగాడిని చాలా బాధించింది. మళ్ళీ స్నానం చేయాలనే ఉద్దేశంతో నదిలోకి దిగాడతను. సరిగ్గా అదే సమయానికి అటు వచ్చిన చేప ఒకటి అతని వేలును చటుక్కున కొరికింది. "నా వేలునే కొరుకుతావా? నువ్వొక మ్రానువైపో!" అని చేపను శపించాడు అతను, చేతిలోని నీళ్ళను నదిలోకే వదిలేస్తూ. మరుక్షణం ఆ చేపకాస్తా మెరిసే ఒక చెట్టులా మారిపోయింది.

అదే సమయానికి అక్కడికి చేరుకున్నాడు విక్రమార్కుడు. రాజ్య పర్యటనకోసం మారువేషంలో ఉన్నాడాయన. నదీ స్నానం చేసి బయటికి వస్తూండగా ఎటో చూసుకుంటూ వచ్చిన మంత్రగాడు రాజుని గుద్ది క్రింద పడ్డాడు. తప్పు అతనిదే, అయినా అతను మాత్రం రాజు మీద మండి పడ్డాడు. "ఏమిరా, కళ్ళు కనబడవా? ఎవరనుకున్నావురా, నన్ను?!" అని గర్జించాడు మంత్రగాడు.

"చూసుకోలేదు, క్షమించండి స్వామీ!" అని దూరంగా నడవటం మొదలు పెట్టాడు విక్రమార్కుడు.

"ఏమిరా, అంత అలక్ష్యం?! ఎంత పొగరు, నీకు?! నువ్వు పిల్లిలా మారిపో!" అని శపించి, మంత్రించిన నీళ్ళు అటువైపుగా చల్లాడు మంత్రగాడు.

విక్రమార్కుడు మామూలు రాజు కాదు కదా, అందుకని అతను గబుక్కున క్రిందకు వంగి తనకు అందిన కట్టెను ఆ మంత్ర జలానికి అడ్డం

పెట్టాడు. ఆ కట్టె వేరేదేదో కాదు; అంతకు ముందు మంత్రగాడి కారణంగా కట్టెగా మారిన పిల్లే అది! ఇప్పుడు మంత్రజలం తగలగానే కట్టెకాస్తా తిరిగి పిల్లిగా మారిపోయింది. గబగబా తన్నుకొని విక్రమార్కుడి చేతిలోంచి తప్పించుకొని పారిపోయిందది!

చేతిలోని కట్టె కాస్తా తటాలున పిల్లిగా మారటం చూసిన విక్రమార్కుడికి నవ్వు ఆగలేదు. కానీ అతని నవ్వుని చూసిన మంత్రగాడికి మటుకు ఎక్కడ లేని కోపం వచ్చింది. కోపం కొద్దీ అతను రాజు వెంట పడటం, అతన్ని ఉడికించటంకోసం రాజు పారిపోవటం జరిగాయి. కొంత దూరం పరుగు పెట్టాక విక్రమార్కుడికి అలసట వచ్చింది. దారిలోనే ఉన్న ఒక బండరాయి మీద కూర్చున్నాడు. అంతలోనే అక్కడికి చేరుకున్న మంత్రగాడు గట్టిగా అరుస్తూ "ఇక్కడ కూర్చున్నావా, దుండగీడా! కాకిలా మారిపో!" అని మంత్రజలం చల్లాడు విక్రమార్కుడి వైపుకు. మరుక్షణంలో విక్రమార్కుడు అక్కడినుండి లేచి ముందుకు దూకటం, మంత్ర మహిమ వల్ల బండరాయి కాస్తా కాకిలా మారి కావు కావు మంటూ ఎగిరిపోవటం జరిగిపోయినాయి!

మరి ఆ బండరాయి అంతకు ముందు ఎగిరి రెట్టవేసిన కాకే కద!



మంత్రగాడికి ఇంకా చాలా కోపం వచ్చింది. మళ్ళీ రాజు వెంట పడ్డాడు. విక్రమార్కుడు పరుగెత్తి ఒక చెట్టు వెనక దాక్కున్నాడు. మీకు అర్థమైందిగా, ఆ చెట్టు ఏంటో? అంతకు ముందు చేపలా ఉండి మంత్రగాడిని కొరికిన చేపే, ఆ చెట్టు. ఈసారి మంత్రజలం తగలగానే ఆ చెట్టుకాస్తా చేపలాగా మారి నవ్వుకుంటూ నీళ్ళలోకి జారిపోయింది.

విక్రమార్కుడు బిగ్గరగా నవ్వేసరికి సన్యాసికి చాలా కోపం వచ్చేసింది. "తన మంత్రాలు ఏవీ వీడి మీద ఫలించటం లేదేమి?" అని ఉడుక్కున్నాడతను. "నువ్వు ఎలుకలు ఉండే గోతిలో పడిపోదువుగాక" అని మంత్రం చదివి నీళ్ళని విక్రమార్కుడి వైపుకు చల్లాడతను. విక్రమార్కుడు చటుక్కున క్రిందికి వంగే సరికి, అక్కడొక అద్దం ముక్క కనబడింది. ఏదో ఒకటి కానిమ్మని ఆయన ఆ అద్దాన్నే అడ్డం పెట్టాడు నీళ్ళకు. ఇంకేముంది, కాంతి లాగానే పరావర్తనం చెందిన ఆ శాపంకాస్తా మంత్రగాడి మీదే పడింది! అతనే పోయి ఎలుకలున్న గోతిలో పడ్డాడు!

ఎలుకలన్నీ తనని కొరుకుతుంటే "రక్షించండి-రక్షించండి" అని మొత్తుకుంటున్న మంత్రగాడిని విక్రమార్కుడే కాపాడాడు. "నీకేమన్నా శక్తి ఉంటే దాన్ని సమాజానికి మేలు చేయటం కోసం ఉపయోగించు. కోపంతో అందరినీ కష్టాలపాలు చేస్తావెందుకు?" అని మందలించాడు మంత్రగాడిని.

తనను కాపాడింది విక్రమార్క మహారాజేనని తెలిసాక మంత్రగాడు సిగ్గుతో కుంచించుకు-పోయాడు. అటుపైన తన శక్తిని సమాజ హితం కోసమే వినియోగిస్తానని మాట ఇచ్చి, ఆ ప్రకారమే నడచుకున్నాడు! ✹

నవ్వండి!

**షుగర్!**

భర్త: ఒక కప్పు కాఫీ తీసురా,కామేశ్వరీ!

భార్య: ఇదిగో, తెస్తున్నానండీ.

భర్త: ఇదేంటి?! కాఫీలో చక్కెర బదులు ఉప్పువేశావ్?

భార్య: ఏంపర్లేదులెండి. మీకు షుగర్ ఉందని, చక్కెర బదులు నేనే ఉప్పు వేశాను తాగండి!

**జ్ఞాపక శక్తి!**

తండ్రి: ఒరేయ్, స్కూల్లో నీ జ్ఞాపకశక్తికిగాను ఏదో బహుమతి ఇచ్చారటగా? ఏదీ చూపించు!

కొడుకు: ఇచ్చారుగానీ, దాన్ని ఎక్కడ పెట్టానో గుర్తుకు రావడం లేదు నాన్నా!

# కొత్త కథ

రచన: విష్ణు, బి.ఎఫ్. ఎ, కాకినాడ.



ఒక యువకుడు చనిపోయాడు. అతన్ని తీసుకెళ్ళడానికి యమ భటులు, స్వర్గ పాలకులు వచ్చారు.



నువ్వు స్వర్గానికి వస్తావా? నరకానికి వస్తావా?" అని అడిగారు అతనిని. యువకుడు అయోమయంలో పడ్డాడు.

"స్వర్గం ఎలా ఉంటుంది? నరకం ఎలా వుంటుంది? అని అడిగాడు వాళ్లని.



స్వర్గ పాలకుల చేతిలో ఒక టచ్‌ప్యాడ్ ప్రత్యక్షం అయ్యింది.

'స్వర్గం అనేది ఇలా ఉంటుంది' అని టచ్‌ప్యాడ్‌లో చూపెట్టారు వాళ్ళు. స్వర్గంలో దేవుడు, భక్తి, నాట్యం ఉన్నాయి.




“మరి నరకం ఎలా ఉంటుందో చూపించండి" అడిగాడు యమ భటుల్ని.

“నువ్వెప్పుడైనా సారాయి దుకాణానికి వెళ్ళావా? నరకం ఖచ్చితంగా ఆ

దుకాణం లాగే ఉంటుంది" అన్నారు యమ భటులు.

సారాయి దుకాణం లాగా ఉంటుందనేసరికి యువకుడికి ఆశ పుట్టింది. నరకంవైపే మొగ్గు చూపాడు. "వెంటనే తీసుకుపోండి; నరకం వచ్చేస్తా" అని తొందరపెట్టాడు.

"సరేలే! నువ్వు ఎట్లా అంటే అట్లా కానిస్తాం" అని యమభటులు అతన్ని నరకానికి తీసుకెళ్ళారు.



తీరా చూస్తే అక్కడ పరిస్థితి వేరుగా ఉంది! యువకుడు నిర్ఘాంత-పోయాడు. "ఇదేంటి, ఇది వేరేలాగా ఉంటుందన్నారుగా?" అన్నాడు.

యమ భటులు నవ్వారు: "అక్కడ మేం నీకు చూపించింది మా అడ్వర్‌టైజ్ మెంటు! దానికీ అసలు వస్తువుకూ తేడా ఉంటుంది మరి!" అన్నారు పళ్ళు నూరుతూ.



# గుర్రపు పిల్ల రెక్కలు

*రచన: సహజ, దేవి, ఆనంద్- బెంగులూరు.*

అనగనగా ఒక ఊళ్ళో ఒక చలాకీ గుర్రపు పిల్ల ఉండేది. దాని పేరు జాకీ. దానికి వేగంగా దౌడు తీయడమన్నా, కొత్త ప్రదేశాలు చూడటమన్నా భలే సరదా. పరిగెడుతూ పోతే ఆకలి మాట కూడా గుర్తుకురాదు దానికి.

కానీ వాళ్ళమ్మ దానిని ఊరి పొలిమేరలైనా ఎప్పుడూ దాటనిచ్చేది కాదు- ' పిల్లది దారి తప్పిపోతుందేమో ' అని భయం వాళ్ళమ్మకి.

ఒక రోజు పగలంతా బుద్ధిగా ఉండి, మధ్యాహ్నం దాటాక కాస్త చల్లబడగానే ఊరి ప్రక్కనున్న అడవిలోకి వెళ్తానని చాలా బ్రతిమాలింది జాకీ. చివరికి ఒప్పుకున్నది వాళ్ళమ్మ, జాకీ ఆనందానికి హద్దులే లేవు. తనివితీరా అడవినంతా చుట్టబెట్టే సరికి చీకటి పడబోతూ ఉంది. అప్పటికి గుర్తుకొచ్చింది- "చీకటి పడే లోపే ఇంటికొచ్చేస్తానమ్మా" అని తను అమ్మకిచ్చిన మాట.

ఇక ఇంటి వైపుకు శక్తికొద్దీ వేగంగా పరుగెత్తింది జాకీ. అది ఇంటికి చేరేసరికి 'హమ్మయ్య' అనుకున్న వాళ్ళమ్మ, దానికి ఇష్టమైన పచ్చిగడ్డి

పెట్టింది. అయితే అప్పటికే అలసట వల్ల కళ్ళు మూతలు పడుతున్నాయి జాకీకి. "ఎంత అందంగా ఉందో అడవి! దాన్ని చూడగానే ఆకలి తీరిపోయిందమ్మా" అని చెప్తూనే నిద్రపోయింది.



ఆ రోజున కలత నిద్రలో జాకీకి ఒక అందమైన కల వచ్చింది: తనకు రెండు రెక్కలు వచ్చేసినట్లూ, వాటితో అది ఆకాశంలో ఎగురుతూ ఉన్నట్లూను! అది ఎగురుతుంటే క్రింద ఉన్న పశువులన్నీ తనను వింతగా చూస్తున్నాయంట, అట్లా పైన ఎగురుతూ క్రింద ఉన్న ఊళ్ళని చిన్నవిగా చూడటం భలే తమాషాగా ఉందిట దానికి. క్రొత్త క్రొత్త ప్రదేశాలు రోజూ బోలెడు చూడగల్గుతోందట, ఆ రెక్కల జాకీ. ఆకాశంలో గడ్డి ఉండదు కదా మరి? అందుకని క్రింద ఎక్కడైనా పచ్చటి పచ్చిక కనిపించగానే దిగి, కడుపు నిండా మేసి, చక్కగా ఎగిరిపోతోందిట.

ఒక రోజున అది అలా మేస్తోంటే, క్రింద నుంచి దాన్ని రోజూ చూసి ఆశ్చర్యపోయే దూడల గుంపు చుట్టు ముట్టిందట దాన్ని. "నీ రెక్కల రహస్యం మాకూ చెప్పవా, దయచేసి?" అని అడిగాయవి దాన్ని.

"ఔను కదా, ఇప్పటి వరకూ నేనూ ఆలోచించ లేదు, నాకీ రెక్కలెప్పుడొచ్చాయబ్బా?" అని కలలో ఆశ్చర్యపోయింది జాకీ. ఎంత ఆలోచించినా తనకు రెక్కలెట్లా వచ్చాయో దానికి గుర్తుకే రాలేదట. "ఉండండి, మా అమ్మ నడిగి చెప్తాను" అని కలలో అనేసి, నిజంగానే "అమ్మా, నాకీ రెక్కలెట్లా వచ్చాయమ్మా, ఎప్పుడు వచ్చాయమ్మా?" అని నిద్రలో కలవరించటం మొదలుపెట్టింది జాకీ.

"కడుపు నిండా తిండి తినకుండా నిద్రపోతే రెక్కలైనా వస్తాయి, ఇంకేమైనా వస్తాయమ్మా" అని జాకీని నిద్రలేపి 'గడ్డి' పెట్టింది వాళ్ళమ్మ.



# నమ్మకస్తుడు

*రచన: శ్రీనాగభూషణం, టీచర్, zpps, తరాలపల్లి, హన్మకొండ, వరంగల్ జిల్లా.*

వనపర్తి అనే గ్రామంలో నగల వ్యాపారం చేసే రంగయ్యకు అత్యవసరంగా నమ్మకస్తుడైన, తెలివైన సహాయకుడు ఒకడు కావలసి వచ్చాడు. వ్యాపారంలో భాగంగా ప్రతిరోజూ బంగారం కొనుక్కురావడమో, అమ్ముకు రావడమో- మొత్తానికి లక్షల్లో సొత్తు చేతులు మారడం- జరుగుతూ ఉండేది. ఈ లావాదేవీల నిర్వహణకు తగిన సహాయకుడిని చూసి పెట్టమని రంగయ్య తన మిత్రుడైన లక్ష్మయ్యను కోరాడు.

గ్రామానికి దూరంగా గురుకులం నడుపుతున్నాడు లక్ష్మయ్య. ఆయన దగ్గర విద్యను అభ్యసించిన విద్యార్థులందరూ మంచి మంచి ఉద్యోగాలలో కుదురుకుని ఉన్నారు. తన వద్ద వ్యాపార విద్యను నేర్చుకుంటున్న శిష్యులలో వినయ్, వరుణ్,

వంశీ అనే ముగ్గుర్ని రంగయ్య వద్దకు పంపాడు లక్ష్మయ్య. వారిలో ఒకరిని ఎంపిక చేసుకోమని సూచించాడు.

ఆ యువకులను ఆహ్వానించిన రంగయ్య "ముందుగా మీకు ఒక పని చెబుతాను- ఎందుకో, ఏమిటో అడగకుండా పూర్తి చేయండి " అంటూ ముగ్గురి చేతుల్లోనూ మూడు మూటలను ఉంచాడు. "ఒక్కో మూటలోను వందేసి రూపాయి నాణాలు ఉంచాను. చూసుకోండి. మీరు ఎవరికి వాళ్ళు వెళ్ళి, వాటిని ఊరి చివరి చెరువులో విసిరి రండి" అన్నాడు.

'డబ్బును చెరువులోకి విసిరెయ్య మంటున్నాడు ఎందుకో?' అని తటపటా యించారు యువకులు ముగ్గురూ.

అయినా మారు మాట్లాడకుండా వెళ్ళి పని పూర్తి చేసుకొని వచ్చారు.

"తమరు చెప్పిన పనిని ముందుగా నేనే పూర్తిచేసాను- డబ్బు మూటను విప్పనైనా విప్పకుండా చెరువు మధ్యకు విసిరి వేసాను" అని వినయంగా చెప్పాడు వినయ్.

"నేను మూటను విప్పిచూశాను, సరిగ్గా వందరూపాయి నాణేలు ఉన్నాయి. మీరు చెప్పినట్టే వాటిని చెరువులోకి విసిరేసి వచ్చాను" అన్నాడు వరుణ్.



"మీరు కొద్దిగా పొరబడినట్టున్నారు. నాకిచ్చిన మూటలో నూటొక్క నాణేలు ఉన్నాయి. మీరు చెప్పినట్టుగా నేను నూరునాణాలను మాత్రం చెరువులోకి విసిరేసి, ఒక నాణాన్ని వెనక్కి తెచ్చాను- ఇదిగోండి" అంటూ ఒక నాణాన్ని అందించాడు వంశీ.

రంగయ్య చిరునవ్వు నవ్వి "ఇది నేను మీకు పెట్టిన పరీక్ష ! ఇందులో నెగ్గిన వంశీనే నా

సహాయకుడుగా ఎంపిక చేసుకుంటున్నాను" అన్నాడు.

"ఇదేం న్యాయం? ఇదేం పరీక్ష?" అడిగారు వినయ్, వరుణ్.

"నిజానికి నేను మూడు మూటల్లోనూ నూటొక్క నాణేలు ఉంచాను. అయితే వినయ్ ఏ మాత్రం తెలివిని ఉపయోగించలేదు. పని తొందరగా కావాలని మాత్రం ఆత్రపడ్డాడు. మూటలోని డబ్బును కనీసం లెక్కకూడా పెట్టకుండా విసిరి వేశాడు. ఇది అతని బద్ధకాన్నీ, ఇతరుల డబ్బు పట్ల అతనికున్న అలక్ష్యాన్నీ సూచిస్తుంది.

ఇక వరుణ్- డబ్బును లెక్క అయితే పెట్టాడు- కానీ మిగిలిన ఒక రూపాయినీ జేబులో వేసుకోకుండా ఉండలేకపోయాడు. తనకు డబ్బు పట్ల ఉన్న వ్యామోహాన్ని అతను ఇలా బయట పెట్టుకున్నాడు.

ఒక్క వంశీ మాత్రమే తన నిజాయితీని నిరూపించుకోగలిగాడు. నాకు కావలసిన వ్యక్తి నాకు అవిధేయుడు ఎట్లానూ కాకూడదు. దానితోబాటు అతను తొందరపాటు మనిషి కాకూడదు, నా సొమ్మును మింగేసే అవినీతిపరుడు కాకూడదు- నా సొమ్మును తనదిగా భావించి, చెప్పిన పనిని జాగ్రత్తగా ఆలోచించి చేసే నమకస్తుడే కావాలి. అందుకు తగిన వాడు వంశీనే అని నాకు అనిపించింది" వివరించాడు రంగయ్య.

ఆయన సమాధానంతో సంతృప్తులైన వినయ్, వరుణ్ ఇద్దరూ రంగయ్యకు నమస్కరించి, 'తమలోని అవగుణాలను అధిగమించటం ఎలాగా' అని ఆలోచిస్తూ ఇంటిదారి పట్టారు.

**చల్లని పిల్లోడు!**

నవ్వండి!

సతీష్: నాన్నా! మా బళ్ళో అందరూ చందమామ మీదకు వెళ్తామన్నారు. కానీ నేను మాత్రం సూర్యుని పైకి వెళ్తానని చెప్పాను.

తండ్రి: ఎట్లా పోతావురా? అక్కడికి వెళితే కాలిపోతావ్!

సతీష్: ఏమీ పర్వాలేదు. రాత్రి పూటే వెళతానులే నాన్నా, సూర్యుడి పైకి!




# ఏ ఆవ్ రా బా వా?!

*"తమకు చదువురాదనీ, తాము తెలివితక్కువ వారమనీ చాలా మంది పిల్లలు విద్యాగంధం లేకుండా ఉండిపోతున్నారు. అట్లాంటి వాళ్ళను ప్రోత్సహించి విద్యావంతులను చేయడం మనందరిబాధ్యత" అంటూ తెనాలి రామలింగని కథగా సుప్రసిద్ధమైన ఈ కథని మరోలా చెప్పారు అమ్మమ్మ గారు.. చదివి చూడండి.*

*రచన: ఆదూరి హైమవతి, విశ్రాంత ప్రధానోపాధ్యాయిని, బెంగళూరు.*

సోంపేటలో ఉండే నాగయ్య కొడుకు సోంబాబు మహా సోంబేరి. ఆటలంటే మహా ఇష్టం, చదువంటే మాత్రం గిట్టదు, భయం! 'బడి' అంటే బందిఖానానే వాడికి.

తాను తెలివి తక్కువవాడిననీ, తనకు అసలు చదువు అనేదే అబ్బదనీ వాడి భావన. అందుకే వాడు బళ్ళో పెద్ద పంతులు కంటపడకుండా తప్పించుకు తిరుగుతుంటాడు.

రోజూ అమ్మ పెట్టిన పెరుగన్నం కడుపునిండా తిని, పుస్తకాల సంచీని భుజానికి తగిలించుకుని, చెట్లమ్మట పుట్టలెమ్మటా తిరిగి, మళ్ళీ బడి వదిలేవేళకు ఇల్లు

చేరుతుండేవాడు వాడు.

అమ్మ-నాయనలకు వాడి ఈ మోసం ఇంకా తెలీనే లేదు. కొడుకు చక్కగా బడికి పోతున్నాడనుకునేవాళ్ళు వాళ్ళు.

ఐతే తన యీడు పిల్లలందరూ బళ్ళో ఉంటారు కదా, అందుకని ఒంటరిగా తిరగటం, ఆడుకోడం కష్టంగా ఉంది సోంబాబుకు. ఏదో ఆడుకుంటున్నాడు గానీ, నిజానికి అసలు సరిగ్గా తోచటమే లేదు.

అంతలో ఒక సోమవారం నాడు చెఱువుగట్టున కూర్చుని నీళ్ళలోకి రాళ్ళు విసురు తున్న రాంబాబు కనబడ్డాడు వాడికి. వాడిని చూడగానే సోంబాబు ఎగిరి గంతేసినంత పని చేశాడు-

"ఒరే రాంబాబూ బావా ! ఈడున్నవేరా?! బళ్ళోకెళ్ళలే!?" అని అడిగాడు.

"ఓరి! సోంబాబు బావా! రారోయ్! బళ్ళోచదువు కట్టం గుందిరా ! రాయాల, సదవాల, లెక్కలెయ్యాల.. నావల్లకాదొరే ! సదూకునేంత తెలివినాకు లేదు! అందుకే ఈ చెఱువు గట్టు కొచ్చినా ! ఇద్దరం కల్సి ఆడుకుందాం రారోరే !" అంటూ లేచి దగ్గరి కొచ్చాడు రాంబాబు.



ఇకనేం? ఇద్దరూ కల్సి ఆడి పాడి, కంచెలోంచి దూరి పళ్ళ తోటలోని కెళ్ళారు . దొంగతనంగా జామపళ్ళు కోసుకు తిన్నారు. ఇంక కాపలా కుక్క ఊరుకుంటుందా? అది గట్టిగా అరిచి వెంటపడటంతో కాపలా కామయ్య కర్ర తీసుకుని లేచి వచ్చాడు- "ఎవడొరే చెట్లకాడ?!" అంటూ. అతన్ని, కర్రని, కుక్కని చూసి పరుగు లంకించుకున్నారు

ఇద్దరూ. వాళ్ళని తప్పించుకునేసరికి గసపోసింది ఇద్దరికీ.

అంతలో బడి నుండి ఇంటి కెళుతున్న పిల్లలు కొందరు ఎదురొచ్చారు వాళ్ళకి. "ఒరే రాంబాబూ, సోంబాబూ ! మీరిద్దరూ బళ్ళోకి రాలేదని పెద్ద పంతులు అడుగుతున్నార్రా ! ఈడేం చేస్తున్నార్రా?" అంటూ అటకా-యించారు వాళ్ళు.

"ఓ అదా! మా నల్లావు తప్పిపోయిందిరా ! మాయమ్మ ఎతుక్క రమ్మంటే రాంబాబునుకూడా తోడు తీసుకెళ్ళానురా !" అంటూ టకాలున అబద్ధం చెప్పేశాడు సోంబాబు.

"ఓరి పోరా, నీ అబద్ధాలు! మీయమ్మ నల్లావును తోలుకెళుతుంటే చూసినంరా, ఇప్పుడే !" అని నవ్వారు సావాసగాళ్ళు.

వెంటనే సోంబాబు తెలివిగా "ఓరి రాంబాబూ, ఇన్నావురొరే ! కర్రావు కనిపించిందిట్రా ! ఇహ రా పోదాం" అనెయ్యగానే ఇద్దరూ నేస్తాలని తప్పించుకుని పరుగెత్తారు.

ఆ మరునాటినుంచీ రాం బాబు సోంబాబుకు తోడయ్యాడు. ఇద్దరూ కలిసి వాగులూ వంకలూ చెడ తిరగసాగారు. ఓ రోజున సోంబాబు వాళ్ళ నాన్న నాగయ్యను పనిమళ్ళా కలిసారు పెద్దపంతులు గారు: "ఏం నాగయ్యా! నీ కొడుకు బళ్ళోకొచ్చి ఎన్నాళ్ళైందో కనీసం నీకైనా తెల్సా? నీలాగే నీ కొడుకునూ 'ఓ'కు ఎన్ని వంకర్లో తెలీకుండా చేస్తావా?" అని అడిగేశారు. అప్పుడుగాని సోంబాబు గుట్టు రట్టు కాలేదు.

దాంతో నాగయ్య మరునాటి నుంచీ "ఒరొరే, సోముగా! నువ్వెటూ బడికి ఎగనామం పెడుతు న్నావ్! ఈ పసూలనైనా మేపుకురా రేపటాల్నుంచీ!" అని తను మేపే నాలుగావులనీ, రెండు గేదెలనీ, అప్పగించటం మొదలు పెట్టాడు. రాంబాబు వాళ్ళ అయ్యకూడా "ఓరి, రాంబాబూ ! నువ్వూ మన గేదెలనీ ఆవులనీ మేపుకురా, పో! ఇయ్యాల్నుంచీ పసుల్ని మేపుకొస్తేనే బువ్వ !" అని గద్దించాడు.

సోంబాబు, రాంబాబు 'భయపడతారేమో,

అట్లా అయినా దారికి వస్తారు' అనుకున్నారు పెద్దోళ్ళు. కానీ వీళ్ళిద్దరికీ మాత్రం 'రొట్టె విరిగి నేతిలో పడినట్లు' అయ్యింది. ఇద్దరూ హాయిగా పశువుల్ని తోలుకుంటూ గాలికి తిరగటం మొదలు పెట్టారు. వీళ్ళకి తెలీదుగాని, పెద్ద పంతులు గారు మాత్రం వీళ్ళని ఎలాగో ఒకలాగా దొరికించుకుందామని ప్రయత్నిస్తూనే ఉన్నారు. "వీళ్ళిద్దరూ తిట్లకి లొంగరు.. దెబ్బలకు అసలు లొంగరు.. మరి దేనికి లొంగుతారు?"

ఒక రోజున ఉదయాన్నే రాంబాబు చేల గట్లంట ఉరుకులూ పరుగులూ పెడుతూ ఎదురుగా వస్తున్న సోంబాబుని ఢీ కొట్టినంత పని చేసి "ఒరే సోంబాబూ! మీ ఆవు ఈనిందిరా!" అని అరిచి చెప్పాడు. సోంబాబుకి జున్ను అంటే చాలా ఇష్టం. ఆవు ఈనిందంటే అమ్మ జున్ను చేసిపెడుతుందిగా? అందుకని వాడు సంతోషంతో "ఏ ఆవ్ రా బా వా?" అని కేకేశాడు.

అప్పుడే అటునుండీ బళ్ళోకెళుతున్న పెద్ద పంతులు "ఓరి భడవల్లారా! మీ కెక్కడిదిరా ఇంత జ్ఞానం? చదువేరాదు అని కోతలు కోస్తారు- మీరు ఐదేసి భాషలు ఎట్లా మాట్లాడార్రా ?!" అన్నారు వాళ్ళకెదురుగా నిలబడి.

సోంబాబు-రాంబాబు ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ "మేం ఐదు బాసలు మాట్టాడ్డవేంటి పెద్దసారూ ?" అన్నారు.

"ఒరే పిల్లలూ ! 'యే'- అంటే మరాఠీలోను, 'ఆవ్' అంటే హిందీలోను, 'రా ' అంటే తెలుగులోను , 'బా' అంటే కన్నడలోను , వా అంటే తమిళంలోను ఒకే అర్థం, తెలుసా- 'రమ్మని ' అర్థం ! మీరేమో మీకు ఏమీ రాదని భయపడి బడి ఎగగొడుతున్నారు! ఐనా అలవోకగా ఐదు భాషలు మాట్లాడేశారే, మరి? మీకు తెలీకుండానే ఇన్నిభాషలు మాట్లాడారే, ఇక బళ్ళో చదువు కుంటే మీ తెలివి ఇంకా పెరగదూ?! కొంచెం ధైర్యం చెయ్యండిరా! బళ్ళోకొచ్చి చదువుకోండి. ఇంకా ఎన్ని భాషలు మాట్లాడి పెద్ద పండితులైపోతారో చూడండి! భాషల్లో ఏమున్నదిరా, ఇట్లా

అంటే అట్లా నేర్చేసుకోగలరు, మీలాంటి తెలివైన పిల్లలు. మీరెంత తెలివిగల వాళ్ళో మీకే తెలీదు ! బళ్ళోకి రండిరా !" అని ఉబ్బేశారు పెద్ద పంతులు గారు.

ఆయన మాటలతో రాంబాబు-సోంబాబులకు తమ తెలివిపైన నమ్మకం కుదిరింది. మరునాటి నుండీ మళ్ళీ బడికెళ్ళటం మొదలు పెట్టారు. కొన్నాళ్ళకు బాగా చదువుకుని మంచి పండితులైనారు !

చూశారా ! తోటివాళ్ళు ప్రోత్సహిస్తే ఎవరైనా ఎంతటి పనులనైనా సులభంగా చేయగల్గుతారు. భయపెట్టి, బలవంతంగా ఎవరిచేతా ఏమీ చేయించలేము ! 




నవ్వు!

**ఏంతెలివి !**

బంటి: '35మార్కులు వస్తే పాస్' అన్నారు కద టీచర్? మరి నాకు 36 మార్కులు వచ్చాయిగా, అయినా ఫెయిల్ చేసారేం?

టీచర్: ప్రతి సబ్జెక్టులో 35రావాలి బంటీ, అన్ని సబ్జెక్టుల్లోనూ కలిపికాదు...!




# భలే కోడలు

రచన: రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.

మిట్టూరులో ఉండే రాముడు చిన్నగా ఉన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోయారు. దాంతో వాళ్ల అవ్వే వాడిని పెంచి పెద్ద చేసింది. వాడు కొంచెం పెద్దవ్వగానే ఆ ఊరి షావుకారుని బతిమాలుకుని, రాముడిని అతని దగ్గర పనికి కుదిర్చింది అవ్వ. రాముడు చాలా అమాయకుడు. చెప్పింది చేయడం తప్ప సొంతంగా ఆలోచించడం తెలియదు వాడికి. వాడి అమాయకత్వాన్ని, ముందూ వెనుకా ఎవరూ లేకపోవడాన్ని ఆసరాగా చేసుకుని, జీతం బత్తెం ఏమీ ఇవ్వకుండా వాడిచేత వెట్టికి చాకిరీ చేయించుకునేవాడు షావుకారు. వరి కుప్పలు నూర్చినపుడు మాత్రం నాలుగు బస్తాల వడ్లు ఇంటికి తీసుకు పొమ్మనేవాడు. అవ్వకు, రాముడికి వాటితో సంవత్సరమంతా గడిచేది కాదు. అవ్వ కూడా పొరుగిళ్ళలో వడ్లు దంచి, పిండి కొట్టి ఇంకాస్త సంపాదించబట్టి,

అతి కష్టంమీద ఇద్దరికీ సరిపడా అన్నం దొరికేది.

'తను ముసలిదైపోతున్నది. తనకేమైనా అయితే రాముడి బ్రతుకేమవుతుంది?' అని చింత పట్టుకున్నది అవ్వకి. చివరికి వాడికి తగిన పిల్లనిచ్చి పెళ్ళి చేస్తే తప్ప లాభం లేదని నిర్ణయానికి వచ్చిన అవ్వ, మంచి పిల్ల కోసం నలుగురినీ విచారించింది. చలంగారిపల్లెలో వీళ్ళ దూరపు చుట్టం రంగయ్య కూతురు సీత చాలా తెలివైందని తెలిసిందామెకు. దాంతోవాళ్ళతోమాట్లాడి, ఒప్పించి, రాముడికి ఆ అమ్మాయినిచ్చి పెళ్ళి చేసి ఊపిరి పీల్చుకున్నది.

కాపురానికి వస్తూనే సీతకు అర్థమైంది- మొగుడి అమాయకత్వమూ, షావుకారు చేస్తున్న అన్యాయమున్నూ. 'ఏం చెయ్యాలి?' అని కొంచెం ఆలోచించిన మీదట ఆమెకు అర్థమైంది- 'ముల్లుని ముల్లుతోనే తీయాలి'. దానికి తగిన సమయంకోసం వేచి చూడటం మొదలుపెట్టిందామె.

ఒకసారి షావుకారు ఏదో పని మీద ఊరికి వెళ్ళాడు. అది తెలిసిన సీత రాముడిని పిలిచి "ఈ గుడిసెలో ఇద్దరికి తప్పితే మూడో మనిషి పడుకోవడానికి చోటు లేదు. నేను వచ్చినప్పటినుండీ పాపం అవ్వ బయటే పడుకుంటున్నది. వచ్చేది చలికాలం. ఇక మీదట ఇట్లా వీలు కాదు- మీ షావుకారి కొట్టంలో ఊరికే పడి ఉండే సామాను తెచ్చి, సాయంత్రానికల్లా రెండు గదులతో ఓ గుడిసె వెయ్యి" అని చెప్పింది. అమాయకపు రాముడు వేరే ఏమీ ఆలోచించలేదు. హుషారుగా పరుగెత్తి, అప్పటికప్పుడు చేతికందిన సామానల్లా తెచ్చి, రెండో రోజుకల్లా గుడిసె వేసేశాడు!

ఊరునుండి వస్తూనే విషయం తెలిసింది షావుకారుకి. రాముడిని రమ్మని కబురు చేశాడు. అయితే వాడితో పాటు సీత కూడా షావుకారు ఇంటికి వచ్చింది- "నమస్కారం బాబుగారూ! మీరు దయతో పంపించిన సామాను పుణ్యమా అని చక్కని ఇల్లు ఒకటి అమరింది. ఇకమీదట నాకు కూడా మీ ఇంట్లో పని ఇప్పించండి- మీకందరికీ బాగా రకరకాల

వంటలు చేసి పెడతాను బాబుగారు " అన్నది అమాయకత్వం నటిస్తూ.



రాముడిని చెడామడా తిడదామని పిలిపించిన షావుకారుకి అప్పటికప్పుడే లోలోపల లెక్కలు వేసుకునే పని పడింది. కొంచెం ఆలోచించగానే ఆయనకి సంతోషం వేసింది కూడాను- 'జీతం లేకుండా తేరగా పని చేయడానికి వీడేకాక, వీడి పెళ్ళాం కూడా దొరికింది' అని.

మరి అప్పటికే ఉన్న వంట మనిషిని ఏం చేయాలి? షావుకారు ఆమెను తీసేసి సీతని వంట పనికిపెట్టుకున్నాడు.

పదిహేను రోజులు గడిచాయి. షావుకారు భార్య సరుకులు తెప్పించమని ఓ పెద్ద చిట్టా ఇచ్చింది షావుకారుకు. దాన్ని చూడగానే ఆయనకు మతి పోయినట్లయింది- " ఇదేమిటీ! నెల రోజులకు సరిపడా సామాను ఇంతకు ముందే తెప్పించావు కదా?! పదిహేను రోజులకే అయిపోయాయా?" అడిగాడు.

"మందిమి ఎక్కువ కాలేదూ? సీత ఇక్కడే తింటుంది; మధ్యాహ్నం పూట మొగుడిని పిలిచి భోజనం పెడుతుంది; పాపం ఇంకా మిగిలితే తప్ప అవ్వకి అసలు తీసుకుపోవటమే లేదు! అయినా తిండి దగ్గర లెక్కలు వేసుకోకండి. ఆమె రుచిగా, శుచిగా వంట చేసిపెట్టేసరికి మనం కూడా ఎక్కువ తింటున్నాం; పిల్లలు బాగా పుష్టిగా ఉన్నారు. ఈ సారి సామాన్లన్నీ కాస్తంత ఎక్కువే తెప్పించండి" విసుక్కున్నది షావుకారు భార్య.

వంటమనిషి జీతం ఆదా అవుతుందనుకున్న షావుకారు తల కొట్టుకుంటూ సరుకులు తెప్పించాడు.

అంతలోనే వరి కోతలు మొదలయ్యాయి. "కుప్పలు నూర్చాక నాలుగు బస్తాల ధాన్యం

తెస్తానులే" అని చెప్పాడు రాముడు అవ్వతో. అది విన్న సీత తన నాన్నకు రమ్మని కబురు పంపింది. నాలుగేసి బస్తాల ధాన్యం ఒక బస్తాలో పట్టేట్టుగా పెద్ద బస్తాలు నాలుగు కుట్టించింది రంగయ్యచేత. కుప్పలు నూరడం అవుతూనే తండ్రితో కలిసి వెళ్ళి, తను తయారు చేయించిన నాలుగు పెద్ద బస్తాల నిండా ధాన్యం ఇంటికి తెచ్చుకుంది.

ఊళ్ళో వాళ్ళంతా ఆమె తెలివికి అశ్చర్యపోయారు. విషయం తెలిసిన షావుకారు రాముడిని పిలిచి "ఏమిట్రా! ఎక్కువ ధాన్యం తీసుకున్నావుట?" అని ఆడిగాడు.

"మీరు తీసుకోమన్నట్లు నాలుగు బస్తాలు మాత్రమే తీసుకున్నాను బాబుగారూ. ఎక్కువెందుకు తీసుకుంటాను?" అన్నాడు రాముడు. అక్కడ ఉన్న పాలేళ్ళందరూ నవ్వారు.

ఇక తన ఆటలు సాగవని గ్రహించిన షావుకారు కోపంతో సీతనీ-రాముడినీ ఇద్దరినీ పనిలో నుండి తీసేశాడు.

'అయ్యో! ఉన్న ఒక్క ఆధారమూ పోయిందే, ఇక బ్రతికేదెలాగ?" అని వాపోతున్న రాముడిని ఓదార్చింది సీత. తండ్రి సహాయంతో రెండు ఎకరాల భూమిని కౌలుకి తీసుకుని, భర్తతో వ్యవసాయం చేయించింది. రాముడి కృషి ఫలితంగా ఆ పొలంలో బంగారుపంటలు పండాయి.

అనతి కాలంలోనే సొంతంగా ఒక ఎకరం పొలాన్ని, ఆవునీ కొనింది సీత! 





# మహిమగల చీపురు పుల్ల

*రచన: యస్.శంకరశివరావు, ఉపాధ్యాయులు, ఇంద్రజాలకులు, జనవిజ్ఞాన వేదిక-రాష్ట్ర సచివులు.*

ఆ రోజు మూడవ సెషన్ సైన్స్ పాఠాలు బోధించడానికి తరగతిలో అడుగుపెట్టారు రావుమాస్టారు.

"గుడ్ ఆఫ్టర్ నూన్ సార్!" అన్నారు పిల్లలు లేచి నిలబడి.

"గుడ్ ఆఫ్టర్ నూన్!" బదులిచ్చాడు రావు మాస్టారు.

అంతలో మీనశ్రీ మాస్టారు దగ్గరకు వచ్చింది.

"సార్! నేనొక మంత్రశక్తిని చూపిస్తాను మీకందరికీ!" అంది. మీనశ్రీ 'ఇన్స్పయిర్' పతక గ్రహీత. బడిలో విజ్ఞానాన్ని ప్రోత్సహించటం కోసం ప్రత్యేకంగా పని చేస్తున్నది.

"మంత్రశక్తా?! సరే, చూపించమ్మా!" అన్నారు మాస్టారు.

గాజుగ్లాసు నిండా నీళ్ళు తెచ్చి బల్లమీద

ఉంచింది మీనశ్రీ. ఏడు అంగుళాల పొడవుండే బెండు పుల్లలు ఓ పది తీసుకు వచ్చింది- ఇళ్ళలో ఊడ్చుకునే పరకలు(చీపుర్లు) ఉంటాయి కదా, వాటిలోంచి.



"ఇవిగో ఈ పుల్లలను ఒక్కొక్కరూ వచ్చి తీసుకోండి. తరువాత నేను చెప్పినట్లు చేయండి!" అంది మీనశ్రీ. పిల్లలు కొందరు గబగబా ముందుకొచ్చి ఒక్కొక్క పుల్లనూ తీసుకున్నారు. ఒక పుల్లను తన దగ్గర ఉంచుకొని, మరొక పుల్లను రావు మాష్టారు గారికి ఇచ్చింది మీనశ్రీ.

"ఇప్పుడు మీ దగ్గరున్న పరక పుల్లలను బాగా పరీక్షించండి. వాటిలో ఎటువంటి మోసమూ లేదు. అంతా నా మంత్రశక్తే పనిచేస్తుంది!" అన్నది పిల్లలతో.

"సరేలే, కానీ వీటితో ఏం చేయాలో తొందరగా చెప్పు!" అన్నాడు శేఖర్.

"తొందర పడొద్దు! ఇప్పుడు ఒక్కొక్కరూ రండి. మీ దగ్గరున్న పుల్లలను ఈ గాజు గ్లాసులోని నీళ్ళలో నిలపాలి. పుల్ల ప్రక్కలకు ఒరిగిపోరాదు- నీళ్ళ మధ్యలోనే నిలచి ఉండాలి. మీలో ఎంతమంది వీటిని నిలపగలరో చూద్దాం. పుల్లని నీళ్ళలో నిల్చేట్లు ఎవరు చేస్తే వాళ్ళకు ఓ 'పెన్ను' బహుమతిగా ఇస్తాను" అన్నది మీనశ్రీ.

"బలేబలే!" అంటూ చప్పట్లు చరిచారు పిల్లలు.

ముందుగా యమున తన దగ్గరున్న పుల్లను గ్లాసులో నిలబెట్టింది. కానీ చేయి వదిలిన వెంటనే పుల్ల పక్కకు ఒరిగిపోయింది. యమున అలా చాలా సార్లు ప్రయత్నించింది. చివరికి "ఇక నా చేత కాదు!" అంటూ

వెళ్ళిపోయింది. మీనశ్రీ ఆ పుల్లను తీసుకున్నది.

అటు తర్వాత ప్రకా ష్ వచ్చాడు హుషారుగా. గ్లాసు ముందర నిలబడి ప్రార్థన చేసాడు. పుల్లను నీళ్ళలో నిలిపాడు- అలాగే చేతితో పట్టుకుని ఉన్నాడు- "ఇక వదులు పుల్లని!" అంది మీనశ్రీ. ప్రకాశ్ చెయ్యి తియ్యగానే పుల్ల కాస్తా పక్కకు ఒరిగిపోయింది.

తరువాత ఇందు, శిల్ప, భాగ్య, మనోహర్, గోపాల్- చివరికి రావు మాస్టారు కూడా ప్రయత్నించారు. పుల్లల్ని నీళ్లలో నిలపడం ఎవ్వరివల్లా కాలేదు.

"మీనశ్రీ! వీటిని నీళ్లలో నిలపటం మా వల్ల కాదు. నువ్వెట్లా చేస్తావో చూపించు!" అన్నారు మాస్టారు. "అవును అవును" అని అరిచారు పిల్లలందరూ.

మీనశ్రీ అందరి దగ్గరా ఉన్న పుల్లలను వెనక్కి తీసుకొని, వాటిని మేజాబల్ల మీద పరచింది. "ఎవరైనా ముందుకు రండి! ఈ పుల్లలలోంచి ఒక దాన్ని తీసి నాకు ఇవ్వండి" అన్నది. గాయిత్రి గబుక్కున ముందుకు వచ్చింది. ఒక పుల్లను తీసుకుని మాస్టారు గారికి యిచ్చింది. మాస్టారు పుల్లను బాగా పరీక్షించారు. అది మామూలు పుల్లే. దానిలో ఏ ప్రత్యేకతా లేదని నిర్ధారించుకున్నాక, ఆయన దాన్ని మీనశ్రీకి ఇచ్చి, "దీనిని ఇక నిలబెట్టు" అన్నారు.



మీనశ్రీ పుల్లను తీసుకున్నది. దాన్ని నీళ్ళలో నిలబెట్టి పట్టుకున్నది. "ఒకటి-రెండు-మూడు! అబ్రకదబ్రా!" అని చెయ్యి వదిలింది. ఆశ్చర్యం! నీళ్ళ మధ్యలో నిటారుగా నిలబడే ఉంది పుల్ల! మీనశ్రీ ఆ పుల్లను బయటికి తీసి, మరొక పుల్లను చేతిలోకి తీసుకున్నది. మళ్ళీ ఏవో మంత్రాలు

చదివి "అబ్రకదబ్రా" అంది. ఆ పుల్లకూడా నీళ్లలో నిటారుగా నిలబడింది!

"మ్యాజిక్ అంతా ఆ పుల్లలోనే ఉంది. దాన్ని నాకివ్వు- నేను నిలబెడతాను" అన్నాడు కిరణ్.

మీనశ్రీ నవ్వింది. "అట్లానా?! సరే! తీసుకో" అంటూ తను నిలబెట్టిన పుల్లనే కిరణ్ చేతికి ఇచ్చింది! కిరణ్ దాన్ని తీసుకుని "అబ్రకదబ్రా" అంటూ నీళ్ళలో వదిలాడు. పుల్ల ప్రక్కకు ఒరిగిపోయింది! అందరూ పకపకా నవ్వారు.

"ఇంకా ఎవరైనా నిలబెట్టగలరా?" అడిగింది మీనశ్రీ. "దీన్ని నా మంత్రశక్తితోటే నిలిపానని ఇప్పటికైనా ఒప్పుకుంటారా?!"

"అంత గప్పాలు అవసరం లేదమ్మా! మంత్రమూ లేదు; చింతకాయా లేదు!దీని వెనుకవున్న రహస్యం ఏంటో చెప్పెయ్యి! అన్నారు రావు మాష్టారు.

"చెప్పటం కాదు; అందరితోటీ చేయిస్తాను. ఇవిగో ఈ పుల్లలను మళ్ళీ తీసుకోండి" అని వాటిని తలా ఒక్కటీ ఇచ్చింది మీనశ్రీ. తరువాత అందరికీ ఒక్కొక్క 'గుండు సూది' ఇచ్చింది. "గుండు సూదా? దీనితో ఏం చేయాలి?" అడిగారు అందరూ.

"గుండుసూదిని పుల్లకు ఒక చివరన లోపలి వరకూ గుచ్చండి. ఇప్పుడు వాటిని నీళ్ళలో నిలపండి! నిలబడకపోతే అడగండి నన్ను!" అన్నది మీనశ్రీ.

గుండు సూదులు గుచ్చిన పుల్లలన్నీ నీళ్ళలో నిటారుగా నిలబడ్డాయి!

"ఇందులో ఏ మంత్రమూ లేదు. ఇది సైన్సే! సూదిని గుచ్చినప్పుడు, పుల్ల అడుగు భాగం బరువవుతుంది కదా, దాని గరిమనాభి క్రిందికి జరుగుతుంది. ఫలితంగా పుల్ల నీళ్ళలో నిలువుగా వ్రేలాడగల్గుతుంది!" చెప్పారు రావు మాష్టారు.

"అవును సార్! క్రింద బరువు లేకుంటే పుల్ల స్థిరంగా నిలబడలేక ఒక ప్రక్కకు ఒరిగిపోతుంది" అంది మీనశ్రీ.

"మరి నువ్వు నిలబెట్టిన పుల్లల్లో గుండు సూది లేదే?! మేం వాటిని బాగా పరీక్షించే

ఇచ్చాంగా?" అడిగాడు సదాశివ.

గుండుసూది నా చేతిలోనే ఉన్నది! మీరు పుల్లని నాకు ఇవ్వగానే నేను మంత్రం చదువుతూ మీ చూపు మళ్ళించాను. అటుపైన మీకు కనబడకుండా సూదిని పుల్ల అడుగున దూర్చేశాను. ఇట్లా ఎవరికీ కనబడకుండా చేసే పనిని మ్యాజిక్‌లో 'హస్తలాఘవం' అంటారు! కొంచెం సాధన చేశారంటే మీకూ అలవడుతుంది ఈ విద్య" అన్నది మీనశ్రీ.

"మరి కిరణ్ నీ దగ్గరి పుల్ల తీసుకొని నిలబెట్టాడుగా, మరి అది ఎందుకు నిలబడలేదు?" అనుమానంగా అడిగింది గాయత్రి.

"అప్పుడు లాఘవంగా గుండు సూదిని తీసేసి ఇచ్చానుగా, అందుకు" నవ్వింది మీనశ్రీ, గుండుసూదిని తీసేసిన పుల్లలు రెండింటిని చకచకా గాయత్రి చేతిలో పెడుతూ!

నవ్వండి!

**భీమ బలుడు!**

రాజు: వారంక్రితం నేను ఒక సింహం కాలు, ఓ ఏనుగు తొండం, ఒక గాడిద ముక్కు విరగ్గొట్టాను.

ఆనంద్: అవునా! అవేమీ చెయ్యలేదా నిన్ను? ఏమైంది అప్పుడు?

రాజు: ఏమవుతుంది? షాపులో బొమ్మలు అన్యాయంగా విరగ్గొట్టానని షాపతను నన్ను ఎట్లా కొట్టాడంటే, ఇప్పటివరకు ఆ నొప్పి తగ్గలేదు...!

**ఆగుము-చూడుము-వెళ్ళుము**

టీచర్: రేవంత్ ఇవాళ స్కూలికి ఆలస్యంగా వచ్చావేంటి?

రేవంత్: చాలా నెమ్మదిగా నడుచుకుంటూ వచ్చాను.

టీచర్: నెమ్మదిగా నడవమని నీకెవరు చెప్పారు?

రేవంత్: సార్, బయట రోడ్డు మీద ఒక బోర్డు పెట్టారు. అందులో "దయచేసి నెమ్మదిగా వెళ్ళండి" అని రాసిఉంది మరి!

# బాల్యం

కవిత

*ఈపెద్దకవితనుచదవండి.. చదువుకోకుండాపనులకుపోయేపిల్లలగురించిఆలోచించండి...*
*రచన: పి.నూతన్‌కుమార్, తెలుగుఉపాధ్యాయులు, తేజవిద్యాలయం, కోదాడమండలం, నల్గొండజిల్లా.*



పాల బుగ్గల పసివాడా
నీ బాల్య మంతా బర్లతోటేనా?
పొద్దు పొడవక ముందులేసి
పసులకు గడ్డి మోపుఎర్రుకొని
కుడితి గోలెం కాడ నువ్వు
కుక్కవోలే కాపలుంటే
కానరాని దేవుడైనా కనికరించడాయె,
మనసున్న మనుషులైనా
మమత చూపరాయె.

ఎండ వేడి నడి వీపున
చీపురు దెబ్బోలే పడుతున్నా
కాళ్ళేమో బొబ్బలెక్కిన
పసుల కసువాయె నీబ్రతుకు,
ఎడ్లసోపతే నీదై పోయెనా?

సిన్న నాడే నీ అయ్య
సిన్న సూపు సూసినాడా
సెప్ప కుండా ఒక్క మాట
సల్లంగా ఎల్లినాడా?
గుండె నిండా బాధలెన్నున్నా
నీకుగుక్కెడు గంజి నీళ్ళు కరువాయెనా?

బడి ఈడు పిల్లలేమో
బస్తీ నేస్తం పట్టినారు.

బడి కెళ్ళే ఈడు వున్నా
బ్రతుకు బండి లాగుడాయె.
తల్లి రుణమే తీర్చుతున్నావా?

ఏదో ఒకనాడు మంచి రోజులొస్తాయి.
కష్టాలు,కన్నీళ్ళు కనుమరుగైపోతాయి.

నీ బాల్యమంత బానిసత్వమైనా,
బడి నిన్ను సాకుతుందయా,
నీ తలరాతను మార్చుకోవయా,
ఇక నీ బ్రతుకంతా పూల బాటయా,
నిన్ను ఓ తేజస్సులా నిలుపుతుందయా.



నవ్వండి!

**చిన్న తాడే!**

జడ్జి: నిన్ను ఎందుకు అరెస్ట్ చేశారు?

ముద్దాయి: నేను రెండు మీటర్ల తాడును దొంగిలించాను సార్.

జడ్జి: అంతేనా! తాడు దొంగిలించినందుకే నిన్ను అరెస్ట్ చేశారా?

ముద్దాయి: క్షమించండి సార్. ఆ తాడు వెనక ఒక గేదె కూడా ఉందండి.

**తొందర!**

మాస్టారు: ఒరేయ్ గోపీ, నువ్వు పెద్దయ్యాక మంచి పేరు తెచ్చుకోవాలి.

గోపీ: అప్పటిదాకా ఎందుకు సార్, మీరే ఒక మంచిపేరు ఆలోచించి చెప్పండి ఇప్పుడే.

**నలుగురు మిత్రులు!**

టీచర్: రాజా రామ్ మోహన్ రాయ్ గురించి నీకు ఏం తెలుసో చెప్పు, రామూ?!

రాము: వాళ్లు నలుగురు మంచి స్నేహితులు టిచర్.

# ఖదీజా నియాజీ

యువకెరటాలు



విశ్వ ఆర్థిక వేదిక వారు ప్రతి సంవత్సరం స్విట్జర్లాండ్ లో నిర్వహించే సమావేశానికి ప్రపంచం మొత్తం మీద నుంచీ ఎంపిక చేసిన మేధావులను, జర్నలిస్టులను ఆహ్వానిస్తారు. ఈ ఏడూ అలాంటి సమావేశం జరిగింది. ఇందులో ఖదీజా నియాజీ (Khadija Niazi) అన్న పన్నెండేళ్ళ బాలిక ప్రసంగం అందరినీ ఆకట్టుకుంది. ఆమెని గురించే ఈసారి పరిచయం చేస్తున్నది!

ఖదీజా పాకిస్తాన్ దేశంలోని లాహోర్ నగరానికి చెందిన అమ్మాయి. అందరిలాగే స్కూలులో చదువుకుంటోంది. ఆ అమ్మాయి కొన్నేళ్ళక్రితం ఆకాశంలో ఎగిరే పళ్ళాల గురించి విన్నది. దాంతో ఆమెకు 'ఆస్ట్రో బయాలజీ' అంటే ఆసక్తి కలిగింది. 'పెద్దయ్యాక తను కూడా భౌతిక శాస్త్రంలో పెద్ద శాస్త్రవేత్త కావాలి. దానికోసం ఇప్పట్నుంచే ఆ దిశగా పరిజ్ఞానం పెంచుకోవాలి' అనుకుంది.

ఈమధ్య కాలంలో ప్రపంచంలోని పెద్ద పెద్ద యూనివర్సిటీలు అన్ని సబ్జెక్టుల పైనా ప్రాథమిక స్థాయి నుండి బాగా ఉన్నత స్థాయి వరకూ క్లాసులు ఇంటర్నెట్ ద్వారా నిర్వహిస్తున్నాయి. వీటిల్లో మనమూ పేరు నమోదు చేసుకుంటే, వారం వారం ఒక క్లాసు, రోజూ చేసుకునేందుకు హోమ్ వర్క్, చివర్లో ఒక పరీక్ష - ఇట్లా మన మామూలు క్లాసుల్లాగే ఇవీ జరుగుతాయి- ఇంట్లో, కంప్యూటర్ ముందన్నమాట! అయితే, ఈ పని చేస్తే మన స్కూల్లో అదనపు మార్కులు ఏమీ ఇవ్వరనుకోండి, అది వేరే సంగతి. ఏదన్నా అంశంపై మనకి ఆసక్తి ఉండి, స్వయంగా చదువుకుని అర్థం చేసుకునేంత పరిజ్ఞానం ఇంకా లేనప్పుడు, ఎంచక్కా ఇలాంటి కోర్సుల్లో చేరి ఆ విషయాలన్నీ ఒకక్రమంలో నేర్చుకోవచ్చన్నమాట!

ఖదీజా చేసింది అదే. తనకి పదేళ్ళు ఉన్నప్పుడు, 'కృత్రిమ మేధ' (Artificial Intelligence)

అన్న కంప్యూటర్ కోర్సు చేసి, పాసయ్యింది. ఆ అనుభవం తనకి నచ్చింది. ఆ తర్వాత వెంటనే ఇంటర్నెట్ లో ప్రాథమిక స్థాయిలో ఫిజిక్స్ అంశాలు బోధించే కోర్సులో చేరింది. ఆ క్లాసులు క్రమం తప్పకుండా వింటూ, తన భౌతిక శాస్త్ర పరిజ్ఞానాన్ని పెంచుకుంది.

ఇంతలో, ఉన్నట్లుండి పాకిస్తాన్ ప్రభుత్వం ఈ క్లాసులనుంచే వెబ్సైటును భద్రతా కారణాల దృష్ట్యా నిషేధించింది. ఖదీజాకు ఇక ఏం చేయాలో తోచింది కాదు! కానీ ఆ కోర్సులే చేస్తున్న ఇతర విద్యార్థులు వెంటనే ఆమెకి ఇతర మార్గాల ద్వారా కోర్సు అందే ఏర్పాటు చేశారు. ఇట్లా అందరి సాయంతో చివరికి ఖదీజా పరీక్ష రాయగలిగింది. ఊరికే రాయడం కాదు, డిస్టింక్షన్ తో ఉత్తీర్ణురాలు అయ్యింది! బాగా కష్టపడాల్సిన ఈ కోర్సులో, తనకంటే పెద్దవాళ్లందరి మధ్య, డిస్టింక్షన్‌లో ఉత్తీర్ణురాలు అయిన అతి పిన్న వయస్కురాలిగా రికార్డు సృష్టించింది! ఈ స్ఫూర్తితో తరువాతి నెలల్లో - ప్రాథమిక కంప్యూటర్ సైన్స్, స్టాటిస్టిక్స్ కోర్సుల్లో కూడా చేరి, వాటిలో కూడా డిస్టింక్షన్‌లో పాసైంది. ప్రస్తుతం గణితానికి సంబంధించిన కోర్సు ఒకటి చేస్తోందట!

ఇట్లా వరుస కోర్సుల్లో ఉత్తీర్ణతలు పొంది, అందరి మన్ననలూ అందుకున్నాక, విశ్వ ఆర్థిక వేదిక సమావేశాలలో 'ఇంటర్నెట్లో చదువుకోవడం ద్వారా తనకి కలిగిన మేలు' గురించి ప్రసంగించింది-! విశ్వ రహస్యాలు తెలుసుకోవాలనీ, అందుకు గాను చరిత్ర, ఆస్ట్రో బయాలజీ, కెమిస్ట్రీ- ఇలా వివిధ అంశాలపై కోర్సులు చేయాలని ఆమె కోరిక. ఈ అమ్మాయి ఇలా కోర్సులు చేస్తూ ముందుకు సాగడమే కాదు, తన స్కూల్లో కూడా మంచి ర్యాంకులు తెచ్చుకుంటూ చదువుకుంటోంది. అప్పుడప్పుడు కవిత్వం కూడా రాస్తుంది. ఈమధ్య ఇంటర్నెట్లో ఒక బ్లాగు కూడా నిర్వహించడం మొదలుపెట్టింది. దానిపేరు- "World studies with me"!

మనమూ చేరదామా, ఆమె ప్రపంచంలో?



# బొమ్మకు కథ రాయండి!

నిర్వహణ: కొత్తపల్లి

ఈ బొమ్మను చూడండి!




పట్నంలో చదువుకునే సుభాష్ పల్లెకొచ్చి, ఎద్దులబండి ఎక్కాల్సి వచ్చింది.

దుమ్ము పీల్చుకోలేకనో, మరి ముఖం దాచుకుందామనో, ముఖానికో గుడ్డ కట్టుకున్నాడతను. చిన్నప్పుడు తనతోబాటే చదివిన ఎర్రయ్య బండిని నడిపిస్తున్నాడు. ఎద్దులేమో కష్టపడి పబండి లాగుతున్నాయి. వీళ్ళ కథ ఏంటో తెలుసా మరి, మీకు? తెలిస్తే రాసి పంపండి. బాగున్న కథని కొత్తపల్లి-60 లో ప్రచురిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101,

ఫోను: 08559240222, 7702877670, ఇ-మెయిలు: team@kottapalli.in

# సమీక్ష

*సమీక్షాకర్త- ప్రియదర్శిని, విజయవాడ*



కొత్తపల్లి-57 చేతిలో వాలగానే సంక్రాంతి రుచుల ఘుమఘుమలన్నీ మదిని తాకాయి. పల్లె ముంగిట రంగవల్లులు తీర్చిదిద్దుతున్న చిన్నారులు ఆనందార్ణవంలో మనసును హత్తుకున్నారు.

మాట తీరు సరిగా ఉంటే కలివిడితనం ఎంత పెంపొందుతుందో; జీవితం ఎంత హాయిగా సాగుతుందో! సంపాదకీయం బాగుంది.

ఐదో తరగతి విద్యార్థిని తరుణిస్ఫూర్తి 'వడ్రంగి ఎంపిక' కథ ద్వారా 'ఎవరైనా చేసే పనిలో నైపుణ్యానికే విలువ, గుర్తింపు లభిస్తాయ'ని తెలియజెప్పిన తీరు స్ఫూర్తిదాయకం.

తొమ్మిదో తరగతి విద్యార్థిని లక్ష్మీతేజ 'పంతులుగారి మంత్రాలు' కథలో వెంగళప్ప పాత్ర సరదాగా వుంది.

చదువనేది మనిషికి ఎంత అవసరమో 'పట్టుదల' ద్వారా ఆరో తరగతి విద్యార్థి మక్సూద్ చక్కగా వివరించాడు. వాళ్ల నాన్నలో మార్పువచ్చి రవికి చదువుకునే అవకాశం దక్కటం బాగుంది. నిజంగానే పట్టుదల ఉంటే దేన్నయినా సాధించవచ్చు.

ఏడో తరగతి విద్యార్థి అరవింద్ రెడ్డి సేకరించిన తెనాలి రామలింగడి కథ 'పారిపోయిన గిన్నెలు' పాతదే. అయినా మళ్ళీ చదివించింది; పొట్ట చెక్కలయ్యేలా నవ్వించింది. ఎదుటి వారిని అమాయకులుగా భావించి అతి తెలివితో లాభపడాలనుకునే వారికి ఈ కథ చెంపపెట్టు!

శారీరక శ్రమ చేయని వారిలో వచ్చే ఇబ్బందులను తొమ్మిదో తరగతి విద్యార్థిని యం చంద్రలేఖ కథ 'బైక్ కన్నా సైకిల్ మేలు' చక్కగా వివరించింది. తొలుత ఆడంబరాలకు పోయి, ఆరోగ్యం దెబ్బతిని, ఆనక సైకిల్ తెచ్చుకోవటం బాగుంది.

తొమ్మిదో తరగతి విద్యార్థిని టీ సాయిహేమాంజలి 'పెట్రోల్ సలహా' కథలో ఒక సామాజిక స్పృహ కనిపించింది. పెట్రోల్ స్వగతానికి రామయ్య కథను జోడించి సందేశాత్మకంగా ముగించటంలో పరిణతి ఉన్నది.

నచ్చిన పనిని ఇష్టంగా చేస్తే ఫలితాలు ఎలా వుంటాయో 'యువకెరటం- ఎలినోర్ హార్డ్విక్ పరిచయం ద్వారా తెలిసింది. పిల్లలకు ఈ కథనం మంచి 'కిక్' ఇస్తుందనటంలో సందేహం లేదు.

ఆశపోతు ధనవంతుడు దిక్కులేని చావు ఎలా చచ్చాడో 'మోసం చేయాలనుకోకు!' కథలో డా.ఎం.హరికిషన్ సీమ మాండలికంలో చెప్పటం ఇతర ప్రాంతాల వారికి కొత్త అనుభూతి. చక్కని గురువు మార్గదర్శనంలో విద్యార్థులు ప్రతిక్షణం ఆనందిస్తూ గొప్పగా ఎదగగల్గుతారు. రమాదేవిగారు స్వయంగా మంచి టీచర్ అయివుంటారు- అందు వల్లే 'ఉపాధ్యాయ లక్షణం' కథని అంత బాగా మలచారని అనిపించింది.

నాలుగు సైన్స్ ట్రిక్కులు నేర్చుకొని జనాన్ని మోసగించి దోచుకున్న దొంగ సాధువు అసలు రూపాన్ని 'నీళ్ళతో వెలిగే ప్రమిదలు' కథలో ఎస్ శంకరశివరావు కళ్లకు కట్టిన తీరు మన అజ్ఞానపు మత్తును కచ్చితంగా వదిలిస్తుంది.

కష్టాల కొలిమిలో కాలినవారు ఎంత దృఢంగా, బలంగా తయారవుతారో మనకు భరోసాగా ధైర్యం నూరిపోస్తూ చెప్పింది, చిన్నిగారి అనువాద కథ 'టీ కప్పు ఆత్మకథ' . ఇక పిఎస్ నాగరాజు గారి 'కండచీమల నాయకుడు-నిద్రమత్తు ఏనుగయ్య' గేయకథ , కొత్తపల్లి సురేష్ 'జండా పాట' పిల్లల్ని చాలా ఉత్సాహపర్చాయి.

కొన్ని కథల్లో వాక్య నిర్మాణం సాఫీగా లేదు. సంపాదకులు ఈ విషయమ్మై కాస్తంత శ్రద్ధ తీసుకోవటం అవసరమేమో! కొత్తపల్లిలోని రంగుల బొమ్మలన్నీ కనువిందు చేశాయి. ఎవిఎం గారి కార్టూన్లు, చిట్టి పొట్టి జోకుల సంగతి సరేసరి! పుస్తకం చివరి పేజీలో 'కథలెందుకు?' నిజంగా కొసమెరుపే! ✷

# చిలిపిప్రశ్నలు -తిక్కజవాబులు

*సేకరణ: శ్రీ వి.వి.యస్.మూర్తి, చొదిమెళ్ళ, పశ్చిమగోదావరి జిల్లా.*

1. abcd లు దేనికి ఉపయోగపడతాయి?

జవాబు: క్రీస్తుపూర్వం (bc), క్రీస్తు శకం (ad)తెలియ చెయ్యటానికి

2. రచయిత్రి వంట చేస్తే..?

జవాబు: ఈ వంట నా సొంతం, దేనికీ కాపీ లేదు" అని రాసి డైనింగ్ టేబుల్ మీద పెడుతుంది.

3. షుగర్ వ్యాధిగ్రస్తులు కూడా తిన దగిన ఫలాలు?

జవాబు: వార ఫలాలు

4. భోజన హోటల్ ముందు బిచ్చగాడు ఏమంటాడు?

జవాబు: బాబూ! ఒకపుల్ మీల్స్ పార్శిల్ బాబూ

5. స్పేస్ సైంటిస్ట్ దీపావళి తారాజువ్వ కాలిస్తే...?

జవాబు: 10...9...8...అంటూ కౌంట్‌డౌన్ ప్రారంభిస్తాడు.

6. ఇంటి ఓనరు ఇరిటేట్ అయ్యేదిఎప్పుడు?

జవాబు: ఇల్లుపీకి పందిరెయ్యమని వాస్తుసిద్ధాంతి అన్నప్పుడు

7. సైన్సు సార్‌కి కోపం వస్తే ఏమంటాడు?

జవాబు: నా బ్లడ్ బాయిలింగ్ పాయింట్ పెరుగుతోంది, జాగ్రత్త! అంటాడు.

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కొంటికి: 25 రూ.
12 పుస్తకాలకైచందా: **రూ. 300/-**

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.
బ్యాంకు అక్కొంటు వివరాలు:
"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**<u>ఈ నెలలో ఏపని-ఎవరిది?</u>**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం 'ముదుపు': వీరాంజి
చిత్రాలు: అడవి, ప్రసాద్, చంద్రకాంత్, చందు, శ్రీధర్, పూర్ణ.
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**<u>ప్రత్యేక కృతజ్ఞతలు:</u>** అరవిందాహైస్కూల్‌వారికి, ప్రభుత్వ ప్రాథమికోన్నత పాఠశాలలు బద్దలాపురం, లేపాక్షి అనంతపురంజిల్లా వారికి, పాలకొండ, వారికి, మ్యాజిక్ కథల శంకర శివరావు గారికి, 'విద్యార్థి' మాలతీకృష్ణగార్లకి, జిల్లాపరిషత్ పాఠశాల- ప్రాథమిక పాఠశాల- తరాలపల్లి వారికి, కార్టూనిస్టు ఏవియం గారికి, రాధా రాజశేఖర్ గార్లకి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్‌సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

మంచిపుస్తకం:

## పద్యపారిజాతాలు

*"తల్లిదండ్రులు తమ పిల్లలకు ఇచ్చే ఆస్తిపాస్తులు - డబ్బు, బంగారం, భూములు, మిద్దెలు, మేడలు విలువైనవే కావచ్చు. అయితే తెలుగు పద్యం అంతకంటే విలువైన ఆస్తి, పిల్లల చేత ఎన్ని పద్యాలు కంఠస్థం చేయిస్తే వాళ్లు అంత శక్తిమంతులు. మేధావులు, శాస్త్రవేత్తలు, నాయకులు, డాక్టర్లు, ఇంజనీర్లు అవుతారు. అమ్మానాన్నలకు అన్నం పెట్టే మంచి మనుషులవుతారు...."* అని మనస్ఫూర్తిగా నమ్మిన దేవినేని మధుసూదనరావు, జయశ్రీ దంపతులు, తమకు నచ్చిన చిట్టి చిట్టి పద్యాలు, పాటల్ని ఓ వందకు పైగా సంకలనం చేసి, 28 పేజీల బుజ్జి పుస్తకాన్నొకదాన్ని ప్రచురించారు. ఎన్నెన్నో బళ్లకు, గ్రంథాలయాలకు, అలా అలా పిల్లలకు పద్యాన్ని చేరవేస్తున్నారు. చాలా చక్కటి పద్యాలున్నాయి అందులో! చదివి నేర్చుకోండి, మీరున్నూ! దేవినేనివారిది నిజంగానే గొప్ప ప్రయత్నం. ఈ యజ్ఞంలో ఏదో ఒక విధంగా పాలు పంచుకోగలిగితే అంతకంటే కావల్సిందేదీ ఉండదు.




పద్యపారిజాతాలు, పేజీలు28

దేవినేని సీతారావమ్మ ఫౌండేషన్,

తెన్నేరు 521260, కంకిపాడు మండలం

కృష్ణాజిల్లా. ఫోను: 0866 2862424

## ఫస్టు ర్యాంకు

"మావాడికి ఎప్పుడూ ఫస్టుర్యాంకే వస్తుంటుంది" చెప్పింది మణిమాలమ్మ సంతోషంగా.

"అవునా! అయితే బాగా చదువుతాడన్నమాట వీడు!" మురిపెంగా అంటూ నానిగాడిని దగ్గరికి తీసుకున్నాను నేను.

మణిమాలమ్మ అన్నది- "యుకెజిలో ఉన్నాడు. ఎప్పుడూ ఏదేదో చెబుతూనే ఉంటాడు. నేనేమో ఇంగ్లీషు చదువుకోలేదుగా, అందుకని ఏమీ అర్థం అవ్వదు నాకు!" అని.

"బాగుందిరా, బలే ఉంది నీ డ్రస్సు. మరి నీకు 'అ ఆ ఇ ఈ'లు వచ్చా?" అడిగా.

"రావు!" అన్నాడు నాని గొప్పగా, తల అడ్డంగా ఊపుతూ.

"ఓహో! మరి ఎబిసిడిలు వచ్చే ఉంటాయి- చెప్పు" అన్నాను.

"గడ గడ గడ..." చెప్పేసి గాలి పీల్చుకున్నాడు వాడు. "భలే!భలే!" మెచ్చుకున్నాను. "ఇంకా ఏమొచ్చురా, నీకు? మీకు రోజూ ప్రార్థన ఉంటుందా, మార్నింగ్ అసెంబ్లీ?" అడిగాను.

"ఓ!" తల ఎగరేశాడు వాడు.

"మరయితే, మీ ప్రేయర్‌లో ప్రతిజ్ఞ చేస్తారు కదా, అది చెప్పు, చూద్దాం!" అన్నాను నేను.

"మా పేయర్లో పతిగ్న ఉండదు!" అన్నాడు వాడు.

"అదేరా, ప్లెజ్- ప్లెజ్ ఉంటుంది కదా, ఇండియా ఈజ్ మై కంట్రీ..." అందించా.

"పెజ్ అంటే...అదుండదు మాకు. వేరేది ఉంటుంది" అన్నాడు వాడు.

"చెప్పుచెప్పు- నేనూ నేర్చుకుంటాను" ఉత్సాహ పరచాను.

చెయ్యి ముందుకి చాపి, మళ్ళీ ఓసారి గడగడా చెప్పాడు- ఐ, ద స్టూడెంట్ ఆఫ్ ***, ఐ ప్రామిస్ దట్ ఐల్ లీడ్ మై లైఫ్ ఇన్ ఎ ట్రూత్ఫుల్ వే. ఐల్ ఆల్వేస్ స్పీక్ ఇన్ ఇంగ్లీష్ ఇన్ ద స్కూల్ క్యాంపస్ అండ్ ఔట్సైడ్ అల్సో..." అని.

"వావ్!" మెచ్చుకున్నాను. "భలే చెప్పావురా! దీని అర్థం ఏంటో తెలుసా, నీకు?" అడిగాను మణిమాలమ్మని.

"అర్తం తెలీదు" అన్నాడు నాని.

"ఇంట్లోనూ, బయటా, ఇంకా స్కూల్లోనూ అంతటా నువ్వు ఇంగ్లీషులోనే మాట్లాడతావట!" నవ్వాను.

వాడూ నవ్వాడు. మణిమాలమ్మ కూడా నవ్వి- "ఇంగ్లీష్ మీడియం కదా, అందుకని" అంది.

"ఇంక నువ్వూ వాడూ మాట్లాడుకునేందుకు వీల్లేదన్నమాట!- నీకేమో ఇంగ్లీషు రాదు; వాడేమో తెలుగులో మాట్లాడకూడదు. బానే ఉంటుందిక, మీ జీవితం!" అన్నాను నేను, నవ్వుతూ.

మణిమాలమ్మ కూడా నవ్వింది. అయితే ఈసారి ఆ నవ్వులో కాస్తంత బెరుకు ఉందేమో అనిపించింది నాకు.

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada,Phone:08662579129